
"ఆటలో ఆటగా నవ్వులో నవ్వుగా, సరిగ్గా చూసీ,
ఆలోచించీ, టక్కున అంటించాలీ యింక,
సరదాగా యిది చెయ్యాలింక"
— ఫెవీ ఫెయిరీ
"ఇంద్రజాలం కానే కాదిది
చేస్తోచేసే తమాషా యిది
దబ్బాతోనూ పనియే లేదు
దీనికి యిక మరి తిరుగేలేదు."
"ఏమిటిదంతా యిటొచ్చి చెప్పు
ఏంచెయ్యాలో దబ్బున చెప్పు."
"రండ్రా యిటు రండ్రా
చెప్పేదేదో వినిపోండ్రా
ఆలోచించి అంటించింక
ఫెవికాల్ ఎమ్ ఆర్ తేవాలింక
ఏ బొమ్మయినా, ఏ బుట్టయినా
ఏ పర్సయినా చేసెయ్యొచ్చు
పట్టుకోకనే పట్టుకునేదిది
మురికి కానిది ముచ్చటైనది
సరదా సరదా తమాషాయిక
బొమ్మలైనా చేసెయ్యింక"

## కావలసిన వస్తువులు :

1. ఒక బుడగ (మీడియమ్ సైజు)
2. వార్తా పత్రికల కొన్ని కాగితములు
3. గులాబి, నలుపు, నీలం మరియు పసుపు పచ్చ రంగుల వెల్వెట్ పేపర్
4. తెల్లటి చార్ట్ పేపర్
5. గులాబి దారము
6. ఫెవికాల్ ఎమ్ఆర్ ఎడ్హెసివ్



**1.** బుడగ మెత్తగా వుండుటకు, శివ వంతు దాకా పూరండి. గాలి బయటకు వెళ్ళకుండుటకై దారముతో గట్టిగా కట్టండి. ఇలా సాగించి కట్టినది, తోక అవుతుంది.



**2.** వార్తాపత్రికను 1''x1'' చదరపు ముక్కలుగా కత్తిరించండి. వీటిలో 10-15 నిమిషములు నాన బెట్టండి. ఒక దాని తరువాత ఒకటి ముక్కలను బుడగ మీద పెట్టండి. ప్రతి ముక్క మరియొక దాని మీద కొద్దిగా పైన వుండవలెను. బుడగ పైభాగము వంతటినీ కప్పండి. ఇదే విధముగా 3 పొరల వార్తా పత్రికలను పెట్టండి.



**3.** ఇప్పుడు వార్తాపత్రికం 1''x1'' చదరపు ముక్కలను తీసుకొని, ప్రతిదానికి ఫెవికాల్ ఎమ్ఆర్ ఎడ్హెసివ్‌ను రాయండి, వాటిని బుడగ మీద అంటించండి, ఈ విధముగా 4 అటువంటి పొరలను అంటించండి. దీనిని 8-10 గంటలు వుండనివ్వండి.



**4.** బుడగ ఎండి గట్టిగా అయినప్పుడు, పిన్నుతో పొడిచి దానిని బ్రద్దలు కొట్టండి. కేవలము వార్తా పత్రిక పొర వుంటుంది. గులాబి వెల్వెట్ పేపర్ 1''x1'' చదరపు ముక్కలపై ఫెవికాల్ ఎమ్ఆర్ ఎడ్హెసివ్‌ను రాసి, వాటిని ఆఖరి పొరగా బుడగను అలంకరించండి.



1½''x3'' సైజు 5 చార్ట్ పేపర్ ముక్కలను తీసుకోండి. వీటితో 1½'' పొడుగు 5 సిలిండర్లను తయారుచెయ్యండి. వీటి మీద నల్ల వెల్వెట్ పేపర్‌ను అంటించండి. 4 సిలిండర్లను బుడగ మీద అంటించి కాళ్ళను తయారుచెయ్యండి. ఒక సిలిండర్‌ను అంటించి ముక్కును తయారుచెయ్యండి. నల్ల వెల్వెట్ పేపర్‌తో కప్పబడిన ఒక గుండ్రటి చార్ట్ పేపర్‌ను ముక్కు మీద అంటించండి.



**6.** చార్ట్ పేపర్‌తో కళ్ళజోడు మరియు చెవులు తయారుచెయ్యండి. నల్ల వెల్వెట్ పేపర్‌ను చెవుల మీద నీలి వెల్వెట్ పేపర్‌ను కళ్ళజోడు మీద అంటించండి. వాటిని సరియైన స్థానములో అంటించండి. పసుపుపచ్చ వెల్వెట్ పేపర్‌తో కళ్ళు మరియు నల్ల వెల్వెట్ పేపర్‌తో కళ్ళ గుడ్లను తయారుచెయ్యండి.



**7.** రెండు 1''x1½'' చార్ట్ పేపర్ ముక్కలను తీసుకొని వాటి మీద గులాబి వెల్వెట్ పేపర్‌ను అంటించండి. వీటిని పోర్కీ శరీరము మీద రెండు వైపులా అంటించి పెన్నులు పెట్టుకొనుటకు జేబులను తయారుచెయ్యండి.

## ...గదుగో యిక పోర్కీ పిగ్ తయారు
## ...పెన్నులను వుంచే కాపలాదారు

# ...ఫెవికాల్ ఎమ్ ఆర్
...థెటిక్ ఎడ్హెసివ్




**...పనిచేసేది, మరెంతో పేరున్నది ఫెవికాల్ ఎమ్ఆర్ అంటేనే అది**



# పాఠకులకు విజ్ఞప్తి

'చందమామ' ప్రచురణకు సంబంధించిన న్యూస్ ప్రింటు కాగితం ధర, యీ మధ్యకాలంలో విపరీతంగా పెరిగిపోయింది. అయినా, పత్రిక వెల పెంచడం ద్వారా, ఆ భారాన్ని పాఠకులపై మోపకుండా వుండేందుకు ఎంతగానో ప్రయత్నించాం. కాని, ఇప్పుడున్న వెలకు పత్రికను వెలువరించడం అసాధ్యంగా పరిణమించింది. అందువల్ల, నవంబర్ '85 సంచిక నుంచీ, 'చందమామ' ప్రతి వెల తప్పనిసరిగా 50 పైసలు పెంచవలసి వస్తున్నది. నవంబర్ '85 నుంచీ 'చందమామ' విడి ప్రతి వెల రూ. 2-50. సంవత్సర చందా 30-00 రూపాయలు.

పాఠకులూ, ఏజంట్లూ ఈ మార్పును గమనించి, మా పరిస్థితిని సహృదయంతో అర్థంచేసుకుని ఎప్పటి లాగే మాతో సహకరించగలరని ఆశిస్తున్నాము.

—ప్రచురణకర్తలు

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''యముడి మహిషం'']కు ఆధారం, ఎం. డి. సౌజన్య రచన. ఒకానొకప్పుడు అయావిద్యల్లో అత్యంత నిపుణులయినవారికి, రాజాశ్రయం లభిస్తూండేది. ఇది ఎరిగిన విద్యావిహీనులు కొందరు, తామూ ఏదో ఒకదానిలో ప్రవీణులమని రుజువుచేసి సుఖపడాలని ప్రయత్నించేవారు. అలాంటివాళ్ళకథే, ''ఆస్థానతిండిపోతు'' అన్నది.

## అమరవాణి

ధనాదికేవ విద్యన్తే, యత్ర మూర్ఖా సుఖాశయా,
తప్తా గ్రీష్మేణ సేవంతే, శైత్యార్థం తే హుతాశనమ్.

[కేవలం ధనం వల్ల సుఖపడగలమనుకునేవాళ్ళు మూర్ఖులు. సుఖం కోసం ధనం కోరడం—వేసవిలో చల్లదనం కోరి నిప్పును ఆశ్రయించడం వంటిది.]

సంపుటి 77 అక్టోబర్ '85 సంచిక 4

విడి ప్రతి : 2–00 : : సంవత్సర చందా : 24–00



# చందమామ కబుర్లు



## 'పెద్ద' పులికి ఏర్ కూలర్స్!

ఈ సంవత్సరం వేసవి ఎండలు, ఢిల్లీ జంతు ప్రదర్శనశాలలోని జంతువులను ఏమీ చేయలేకపోయాయి. ఎందుకంటే, అక్కడి చిన్న చిన్న మృగాలకూ, పక్షులకూ ఎండ తగలకుండా పందిళ్ళు వేశారు. పులులకు పంకా సదుపాయాలు చేయబడ్డాయి. తెల్లపులులకు ప్రత్యేకంగా ఏర్ కూలర్స్ ఏర్పాటు చేశారు!



## చెవిటివారికి ఫోన్!

బ్రిటన్‌లోని ఎస్సెక్స్ విశ్వ విద్యాలయంలో చెవిటివారికి ఉపయోగపడే 'విజువల్ టెలిఫోన్' రూపొందించబడింది. టెలిఫోన్ తీగలగుండా, బొమ్మల సాయంతో, సైగలను ప్రసారం చేసే సాంకేతిక విధానం ద్వారా ఇది తయారు చేయబడింది.



## చారిత్రక పూర్వయుగ వాతావరణం

ప్యారిస్ నగరానికి 200 కి.మీ. దూరంలో ఉన్న మొర్వాన్ ప్రాంతంలో ఒక చారిత్రక పూర్వయుగ ఉద్యానవనం రూపొందింపబడుతున్నది. ఒక కాలఘట్టంలో భూమి మీద నడయాడిన డినోజార్స్ వంటి జంతువుల శిల్పాలను, కార్డొ లీ గిటాన్ అనే కళాకారుడు తయారు చేస్తున్నాడు. జీవకళ ఉట్టిపడే ఈ శిల్పాలను నిజమైనవనుకుని, చుట్టుపక్కల ఉన్న ఇతర జంతువులు వీటిని సమీపించడానికి భయపడుతున్నాయట!

## మీకు తెలుసా?

1. భీమానది ప్రధాన ఉపనదిగా గల నది ఏదో మీకు తెలుసా?
2. చంబల్ నది ఏ నదికి ఉపనదో మీకు తెలుసా?
3. అరేబియా సముద్రంలో సంగమించే మన నదులలో పెద్దది నర్మద. మరి రెండవ పెద్ద నది ఏదో మీకు తెలుసా?
4. బీహార్ 'విషాదనది' అని దేనిని పిలుస్తారో మీకు తెలుసా?
5. 'గాంధీసాగర్ డాం' ఏ నది మీద నిర్మించబడి ఉన్నది?

(సమాధానాలు 65వ పేజీలో)

పురాణగాథలు :

# అంబరీషుడు

అంబరీషు డనే రాజు గొప్ప విష్ణుభక్తుడు. ఆ రాజు భక్తికి మెచ్చి, విష్ణువు తన సుదర్శనచక్రం ఆయనకు రక్షణగా ఉండే విధంగా వరం ఇచ్చాడు.

ఒకసారి అంబరీషుడు సంవత్సరం పొడవునా వ్రతం ఆచరించాడు. వ్రతం చివరి మూడు రోజులూ ఉపవాసం చేసి, ఆఖరి రోజున దైవపూజలు జరిపి, భోజనం చేయడానికి ఉపక్రమించాడు. సరిగ్గా ఆ సమయానికి, దుర్వాసముని వచ్చి, "కొంతసేపు ఆగు; స్నానం చేసి వస్తాను," అని చెప్పి నదికి వెళ్ళాడు.

కాని, ఎంతసేపటికీ దుర్వాసముని నది నుంచి తిరిగి రాలేదు. అక్కడ ఉన్న ఇతర 'మునులూ, ఋషులూ శుభఘడియలు దాటిపోకముందే ఉపవాసం ముగించవలసిందిగా అంబరీషుణ్ణి కోరారు. ఆ పెద్దల కోరిక ప్రకారం, ఆయన ఉపవాసం విరమించినందుకు సూచనగా కొద్దిగా జలపారణ చేశాడు.

అప్పుడే అక్కడికి వచ్చి, దానిని చూసిన దుర్వాసముని కోపావేశంతో, "నేను రాకముందే ఉపవాసం విరమించి నన్ను అవమానపరుస్తావా?" అని, తల నుంచి ఒక జడను లాగి నేలకు కొట్టాడు. ఆ జడ నుంచి ఒక రాక్షసుడు పుట్టి అంబరీషుడి కేసి రాసాగాడు. అంబరీషుడు సుదర్శనచక్రాన్ని స్మరించాడు. మరుక్షణమే విష్ణుచక్రం వచ్చి, ఆ రాక్షసుడి తలను ఖండించి, దుర్వాసుని తరమసాగింది.

ఎదురుచూడని పరిణామానికి హడలిపోయిన దుర్వాసుడు, పరుగు పరుగున దేవేంద్రుడి దగ్గరికి పోయి శరణు వేడాడు. అయినా ప్రయోజనం లేకపోయింది. అతడు అక్కడి నుంచి వెళ్ళి బ్రహ్మనూ, శివుణ్ణీ వేడుకున్నాడు. వారు కూడా అతన్ని సుదర్శనచక్రం నుంచి కాపాడలేమన్నారు. ఆఖరికి దుర్వాసుడు వైకుంఠానికి పోయి, కాపాడమని విష్ణువు పాదాలపై పడ్డాడు. విష్ణువు చిన్నగా నవ్వి. "సుదర్శన చక్రాన్ని ఉపయోగించుకునే వరాన్ని అంబరీషుడి కిచ్చాను. దానిని నేను కూడా ఆపలేను. కావాలంటే నువ్వే వెళ్ళి అంబరీషుడి శరణు వేడుకో," అని సలహా ఇచ్చాడు.

చేసేదిలేక, దుర్వాసుడు అంబరీషుడి దగ్గరకు వచ్చి, క్షమాపణలు చెప్పుకున్నాడు. అంబరీషుడు విష్ణువును స్మరించి, సుదర్శనచక్రాన్ని ఉపసంహరించాడు.






## 12

[శంఖుడు వుండే కొండ ప్రాంతాన చంద్రవర్మ, కాపాలినిని కలుసుకున్న తరవాత వాళ్లిద్దరూ కలిసి శంఖుణ్ణి హతమార్చేందుకు వ్యూహం పన్నారు. సూర్యోదయం వేళ కొండ చివరికి వచ్చిన శంఖుణ్ణి, చంద్రవర్మ కొండ కింది అగాధంలోకి పడేలా చేశాడు. అగాధంలోకి పడిపోయేముందు శంఖుడు తన మంత్రదండం విసిరి, మంత్రగృహాన్ని సరస్సులో కూలేటట్టు చేశాడు. తరవాత —]

మాంత్రికుడైన శంఖుడు, 'మోసం! ద్రోహం!' అంటూ ఎలుగెత్తి కేకపెట్టి, చేతిలో గల మంత్రదండాన్ని, మంత్ర గృహం కేసి విసరటం చూస్తూనే, కాపాలిని కుప్పలా కూలిపోయింది. ఇంతలో శంఖుడి మంత్రగృహం పెళపెళా రావాలతో పునాదుల నుంచి కదిలి, గాలి లోకి లేవటం చూసి చంద్రవర్మ నివ్వెర పోయాడు. అతడు తన నివ్వెరపాటు నుంచి కోలుకొనేలోపలే మంత్రగృహం దభీమంటూ సరస్సులో పడిపోయింది. భయాశ్చర్యాలతో నిలువెల్లా వణికిపోయిన చంద్రవర్మ, కాపాలిని తన పక్కన నిస్త్రాణగా కూలబడటం చూడలేదు.

"వర్మా!" అన్న సన్నని పిలుపు వింటూనే చంద్రవర్మ ఏదో మైకం నుంచి బయటపడినవాడిలా అయి, కాపాలిని కేసి చూశాడు. కాపాలిని తన పక్కన



కాపాలిని అలా మాట్లాడేసరికి చంద్ర వర్మ తన ప్రయత్నం విఫలమయిందని గుర్తించాడు. అతడు మంత్రగృహం పడటంవల్ల సరస్సులో ఉవ్వెత్తుగా లేచిన అలలకేసి బాధగా నిట్టూర్పుతూ చూసి, "కాపాలినీ! మంత్రగృహంతో పాటు నువు కావాలనుకున్న అపూర్వశక్తులు గల శంఖం కూడా సరస్సులో పడి పోయిందనేనా నీ అనుమానం?" అని అడిగాడు.

"అనుమానం కాదు, వర్మా! జరిగిందే అది. శంఖుడి మంత్రగృహంలో ఆ అపూర్వ శక్తులు గల శంఖం ఒకటే కాదు....ఇంకా అనేక మహాశక్తివంత మయిన వస్తువులున్నవి. నేను కోరిందల్లా ఆ ఒక్క శంఖమే. కాని, నీకు నీ రాజ్యాన్ని శత్రువుల నుంచి సునాయాసంగా గెలిచి పెట్టగలిగిన అపూర్వవస్తువులెన్నో, మంత్ర గృహంతో పాటు సరస్సుపాలయినై. ఇప్పుడు మన యిద్దరమూ గొంగళి సామెతగా, వేసినచోటనే వున్నాం," అన్నది కాపాలిని.

వున్న బండరాళ్ళలో ఒకదాన్ని ఆసరాగా పట్టుకుని లేచేందుకు ప్రయత్నిస్తున్నది. చంద్రవర్మ ఆమెకు చేయి అందించి సాయపడ్డాడు.

"వర్మా, నన్ను పట్టి పీడిస్తున్న దుర దృష్టదేవతే నిన్నూ పట్టినట్టున్నది. శంఖుడు ఆఖరి క్షణంలో మన ప్రయత్నా నికి విఘాతం కలిగించాడు. ఇప్పుడు నీవూ నేనూ కూడా పూర్వపు నిస్సహాయ స్థితిలోనే వున్నాం. ఉన్నచోటు వదిలి, అనేక ప్రమాదాలకు లోనై ఈ శంఖుడి కొండను చేరిన నీకూ నాకూ కూడా చివరకు మిగిలింది, నిరాశా నిస్పృహలే," అన్నది కాపాలిని.

చంద్రవర్మ, ఆఖరి క్షణంలో చేజారి పోయిన అపూర్వ వస్తువుల్ని తలుచుకుని ఓ క్షణకాలం నిశ్చేష్టుడై, అంతలోనే గుండె దిటవు చేసుకుని, "కాపాలినీ, గతించిపోయినదానికి యిప్పుడు విచారించి

లాభం లేదు. క్రూరకర్ముడైన మాంత్రికుణ్ణొకణ్ణి యమపురికి పంపాం, అంతే చాలు,'' అంటూ అప్పుడే ఏదో గుర్తుకు వచ్చినవాడిలా కళ్ళింత చేసుకుని ఆమె కేసి చూస్తూ, ''ఆ శంఖం నీటిపాలయింది గదా? ఇప్పుడు నీ వృద్ధాప్యాన్ని పోగొట్టి, నీకు తిరిగీ జవసత్వాలిచ్చే వస్తువుకోసం ఎక్కడ వెతకటం?'' అన్నాడు.



''ఎక్కడ వెతికినా ఆ శంఖం లాంటిది మరొకటి దొరికే అవకాశం లేదు, వర్మా!'' అన్నది కాపాలిని నిస్పృహగా. ''నేను యిప్పటికే మామూలు మానవు లెవరూ జీవించనంత కాలం జీవించాను. యిదే విధంగా బతుకుతూ పోవాలన్న ఆశ కూడా నాలో నశిస్తున్నది. యింకా ఎంతకాలం బతికితే మాత్రం కొత్తగా నేను అనుభవించబోయే సుఖాలు ఏమున్నవి గనక? ఇప్పుడు నా విచారమంతా నిన్ను గురించే. నాకోసం నీవు చాలా శ్రమపడ్డావు. ప్రాణాపాయానిక్కూడా గురయావు. అటువంటి నీకు ప్రతిగా నేను ఎలాంటి సహాయమూ చేయలేని నిర్భాగ్య స్థితిలో వున్నాను.'' అన్నది.

ఈ మాటలు చంద్రవర్మలో ఆమెపై ఎంతో జాలినీ, గౌరవాన్నీ కలిగించినై. ఆమె శంఖుడి నుంచి అపూర్వశక్తులు గల శంఖాన్ని సంపాయించేందుకు ఎన్నేళ్ళ గానో ప్రయత్నించి, అది విఫలం అయిందని గుర్తించి కూడా అంత విచారపడటం లేదు. ఆమెను యిప్పుడు పట్టి బాధిస్తున్నదల్లా తనకు తిరిగి రాజ్యం సంపాయించుకునేందుకు సహాయపడలేకపోయానన్నదే.

''కాపాలినీ! నీవు నాకు చేసిన సహాయం కూడా చాలా వున్నది. నేను నదిలో పడి, నీవున్న అడవి ప్రాంతాలకు చేరినప్పుడు, నాకు మరణం తథ్యం అనిపించింది. కాని, నీవు నీ గృహంలో నాకు ఆశ్రయం యిచ్చి, ఎంతగానో తోడ్పడ్డావు. నీకు నేను కలకాలం కృతజ్ఞుడనై వుండేందుకు ఆ సహాయం చాలు.




కాపాలిని సరేనన్నట్టుగా తల వూపింది. చంద్రవర్మ రాళ్ళమధ్యన వున్న కాలిబాట వెంట కొండ మీదికి బయలుదేరాడు. అతడికి వెనకగా కాపాలినీ, కాలనాగూ రాసాగారు. చంద్రవర్మ తను శంఖుణ్ణి అగాధంలోకి పడేలా చేసిన తూర్పువైపున గల కొండ అంచు దగ్గిరకు రాగానే, అక్కడ ఆగి, కిందికి తొంగి చూశాడు. అతడి దృష్టికి అగాధం అడుగున బండ రాళ్ళ మీద బోర్లా పడివున్న శంఖుడు కనిపించాడు. ఓ క్షణకాలం చంద్రవర్మ మరల్చకుండా అతడి కేసి చూసేంతలో, శంఖుడి చేయి ఒకటి కొంచెంగా కదిలి నట్టు అతడికి అనుమానం కలిగింది. ఆ వెంటనే చంద్రవర్మలో ఆ క్రూర మాంత్రి కుడి మీద ఎక్కడ లేని ద్వేషం పుట్టు కొచ్చింది.

చంద్రవర్మ తనను సమీపిస్తున్న కాపాలిని కేసి తిరిగి, ''కాపాలినీ! ఆ పాపి శరీరంలో యింకేపాటో జీవం వున్నట్టు నా కనుమానంగా వున్నది. ఒకవేళ వాడు తిరిగి బతకటం జరిగితే, మనకు వాడివల్ల ముప్పు తప్పదు. ఇదుగో, ఇప్పుడే యీ రాతితో ఆ మాంత్రికుడి తలను ఛిన్నా భిన్నం చేస్తాను,'' అంటూ పక్కన వున్న ఒక పెద్ద రాతిని ఎత్తి గురిగా అగాధం లోకి వదిలాడు.

సరే, యిప్పుడు మనం చేయవలసిన దేమిటి?'' అన్నాడు చంద్రవర్మ.

కాపాలిని, కొండ కేసి చూస్తూ, ''వర్మా! ఇక మనిద్దరి మార్గాలూ వేరుకాక తప్పదనుకుంటాను. నేను మిగిలివున్న కొద్ది కాలాన్నీ యీ కొండపైనే గడుపు తాను. జీవితపు ఆఖరి దశలోనైనా స్థిమి తంగా ఒకచోట వెళ్ళబుచ్చటం మేలని భావిస్తున్నాను,'' అన్నది విచారంగా.

''అలా అయితే, యీ కొండ మీద ఒక మంచి చోటుగా చూసి, అక్కడ నీకోసం గృహం నిర్మించేందుకు నేనూ, కాలనాగూ ప్రయత్నిస్తాం. కొండ మీదికి వెళదామా?'' అన్నాడు చంద్రవర్మ.

తరవాత చంద్రవర్మ, కాపాలినీ కొంత దూరం నడిచి ఒకప్పుడు శంఖుడి మంత్ర గృహం వున్న ప్రదేశానికి వచ్చారు. ఆ ప్రదేశంలో యిప్పుడు ఆ గృహం వుండ వలసిన చోట నిలువు లోతు పునాదులు మాత్రమే వున్నవి. చంద్రవర్మ వాటిని కాపాలినికి చూపుతూ, "నీకు కావలసిన గృహాన్ని యీ పునాదుల మీదే నిర్మించ వచ్చు. నీకు సమ్మతమేనా?" అని అడి గాడు.



కాపాలిని అందుకు అంగీకరించింది. అప్పటికి సూర్యుడు తూర్పున రెండు మూడు బారలు పాకాడు. చంద్రవర్మ తూర్పుదిక్కు కేసి ఓమారు చూసి, "ఆకలి దహించుతున్నది. ఇంత ఆహారం తిని పని ప్రారంభించితే ఎంత బావుం డును. పండ్లూ ఫలాలకోసం తిరిగి కొంత దిగాలి," అన్నాడు నిట్టూరుస్తూ.

చంద్రవర్మ బాగా అలిసిపోయాడని గ్రహించిన కాపాలిని, కాలనాగు కేసి తిరిగి, "కాలనాగూ! ఇదుగో నీకు తిరిగీ నీ పూర్వ మానవరూపం యిస్తున్నాను. ఈనాటి నుంచీ నీవు స్వేచ్ఛాజీవివి. నీ ఇచ్ఛ వచ్చిన చోటికి పోవచ్చు," అని ఏదో మంత్రం జపిస్తూ తన చేత గల మానవాస్థికతో కాలనాగు తలలను తాకింది. వెంటనే ఆరడుగుల ఎత్తూ, దృఢంగా చెట్టు బోదెల ప్రమాణంలో వున్న కాళ్ళూ, బలమైన చేతులూ గల ఒక యువకుడు అక్కడ ప్రత్యక్షమయాడు.

"కాపాలినీ, నీ దయకు కృతజ్ఞుణ్ణి!" అన్నాడా యువకుడు. తరవాత అతడు చంద్రవర్మ కేసి తిరిగి, "అయ్యా, మీ మేలు మరిచిపోలేను," అంటూ నమస్క రించాడు.

"లోగడ మానవ రూపంలో వుండగా నీవు ఏ పేరున పిలవబడేవాడివో నాకు తెలియదు. నాకు సర్పకేతుడనే శత్రు వొకడున్నాడు. నీవు నా మిత్రుడివి గనక, నీకు కాలకేతుడనే పేరు పెట్టదలిచాను," అన్నాడు చంద్రవర్మ.




"అవును, నన్ను కాలకేతుడనే పిలవండి! ఏనాటికైనా నేను మీ శత్రువైన ఆ సర్పకేతుణ్ణి బలి పుచ్చుకుని, కాలకేతుడనే నామం సార్థకం చేసుకుంటాను," అన్నాడు యువకుడు.

తరవాత కాలకేతుడు కొండ దిగి వెళ్ళి, సరస్సు ఒడ్డున గల పండ్లతోటలో వివిధ రకాల పండ్లు కోసుకుని, వాటితో చంద్రవర్మ, కాపాలిని దగ్గిరకు తిరిగి వచ్చాడు. ముగ్గురూ ఆ పండ్లు తిని దాపులనే వున్న సెలయేరులో నీరు తాగారు. కొంచెం సేపు విశ్రమించిన తరవాత చంద్రవర్మా, కాలకేతుడూ కలిసి శంఖుడి మంత్రగృహపు పునాదుల మీదే కాపాలిని కోసం రాళ్ళతో గృహం నిర్మించసాగారు. ఆ పని సూర్యాస్తమయ సమయానికల్లా పూర్తయింది.

అ రాత్రికి ముగ్గురూ ఆ గృహంలోనే పడుకున్నారు. చంద్రవర్మకు నడిరేయి అయినా కునుకు పట్టలేదు. అతడు తన భావి కార్యక్రమాన్ని గురించి ఆలోచించసాగాడు. తను కాపాలిని సహాయం వల్ల అపూర్వశక్తులు సంపాయించి తిరిగి తన రాజ్యాన్ని జయించుకోవాలన్న ప్రయత్నం విఫలమయింది. తన తండ్రిని మోసగించి అతి క్రూరంగా హత్య చేసిన సర్పకేతుడు, యిప్పుడు మొత్తం మాహిష్మతీ రాజ్యానికే రాజై వుంటాడు. అటువంటివాణ్ణి జయించాలంటే తనకు ఎంతో సైన్యం కావాలి. సైన్యాన్ని పోగుచేయటానికి ధనం ముఖ్యం. అంత ధనం తన కెక్కడ లభించేటట్టు?

చంద్రవర్మ యిలాంటి ఆలోచనలతో నిద్ర పట్టక ఒక రాత్రివేళ బయటికి పోయి వెన్నెలలో అటూ యిటూ తిరగసాగాడు. కొంచెం సేపటికల్లా కాలకేతుడు అతడి దగ్గిరకు వచ్చి, "అయ్యా, యింత రాత్రివేళ యిక్కడ వున్నారేమిటి? ఏ సమస్యను గురించి మీరింతగా ఆలోచిస్తున్నారు?" అని అడిగాడు.

"కాలకేతూ, నాకు అన్నీ సమస్యలే!" అన్నాడు చంద్రవర్మ. "నేను రాజ్యం

పోగొట్టుకుని అడవుల పాలయానని నీకు తెలుసుగదా? కాపాలినివల్ల సహాయం పొందగల ననుకున్నాను కాని, ఆఖరి నిమిషంలో శంఖుడు తన మంత్రగృహాన్ని సరస్సులో కూల్చటం ద్వారా, అందరికీ ఆశాభంగం కలిగించాడు. నేను తిరిగి ఎక్కడికిపోయి, ఎవరి నుంచి సహాయం కోరాలో తెలీక మథనపడుతున్నాను. ఈ చుట్టుపక్కల ఎంత దూరంలో మానవ నివాసాలున్నవో నీకు ఏమయినా తెలుసునా?'' అని అడిగాడు.




''ఈ కొండల్లో, అడవుల్లో ఉత్తర దిక్కుగా ఒక్క నూరు యోజనాలు ప్రయాణిస్తే, మీరు తిరిగీ జనపదాలను చూడగలుగుతారు. నేను మీ వెంట రావా లనుకున్నాను. కాని, కాపాలినిని నిస్సహాయంగా యీ కొండ మీద ఒంటరిగా వదలటం నాకు మనస్కరించటం లేదు. ఆమె మరి ఎంతోకాలం బతకదు. ఆ తరవాత ఆమె తన పాత ఇంట వదిలి వచ్చిన, భూత వర్తమాన కాలాలను ప్రతిఫలించే గాజుగోళం సహాయంతో నేను మీ దగ్గిరకు తప్పక వస్తాను. ఆ గాజుగోళం మీకూ ఎంతో ఉపకరించవచ్చు!" అన్నాడు కాలకేతుడు.

కాలకేతుడి మాటలు చంద్రవర్మకు ఏమాత్రం ఉత్సాహం కలిగించలేదు. ఈ చుట్టుపక్కల వున్న భయంకరమైన కొండలూ, అడవుల్లో నూరు యోజనాలు ప్రయాణం చేయగలిగితే అప్పుడు తను మనుషులు నివసిస్తున్న ప్రాంతాలకు చేరగలుగుతాడు. ఈ నూరు యోజనాల ప్రయాణంలో తను ఎన్ని భయంకర ప్రమాదాలకు గురి కావలసి వున్నదో ఆ ఈశ్వరుడికే ఎరుక!

చంద్రవర్మ సూర్యోదయం వరకూ యిలాంటి ఆలోచనలతోనే కాలం గడిపాడు. సూర్యోదయం కాగానే అతడు సరస్సులో స్నానంచేసి, కాపాలిని దగ్గిరకు వెళ్లి తన ప్రయాణాన్ని గురించి చెప్పాడు. కాపాలిని అతణ్ణి దీవించి, ''వర్మా, నీవు

ఎన్ని కష్టాలు ఎదుర్కొన్నప్పటికీ చివరకు శత్రు సంహారంచేసి నీ రాజ్యాన్ని గెలుచుకొనగలవని నా దృఢ విశ్వాసం.'' అన్నది.

తరవాత చంద్రవర్మ కాపాలినికీ, కాలకేతుడికీ సెలవు చెప్పి కొండ దిగి, ఉత్తర దిక్కుగా మహారణ్యంలో నడవ సాగాడు.

అతడు ఆ విధంగా పొద్దు నడి నెత్తి కొచ్చేవరకూ నడిచి, బడలిక తీర్చుకునేందుకు, ఒక మహావృక్షం కిందికి వెళ్ళాడు. ఆ వృక్షం కింద పడుకునేందుకు చదునైన స్థలం కోసం గాలిస్తున్న చంద్రవర్మకు, వృక్షపాదంలో దాదాపు నాలుగడుగుల పొడవున్న ఒక ఇనప గొలుసు కనిపించింది. ఈ మహారణ్యంలో అలాంటి వస్తువు తన కంట బడినందుకు అతడు ఆశ్చర్యపోతూ, ఆ గొలుసును చేతికి తీసుకుని పరీక్షించి చూశాడు. అది వాడుక లేనందున బాగా తుప్పుపట్టి వున్నది. ఆ ఇనపగొలుసు ఈ అరణ్యం మధ్యకు ఎలా వచ్చి వుంటుంది? అని చంద్రవర్మ మథనపడుతున్నంతలో, దూరంగా మహా భయంకరమైన మొరుగు ఒకటి వినిపించింది.

ఆ మొరుగు వింటూనే చంద్రవర్మ ఒర నుంచి కత్తి దూసి లేచి నిలబడ్డాడు. దూరంగా కొండరాళ్ళ మీద కుప్పించి దూకుతూ, కోరలు సాచి తనకేసి వస్తున్న పెద్ద కుక్క ఒకటి అతడి కంటబడింది. ''ఇది మామూలు కుక్క అయివుండదు. ఆ రూపంలో వున్న భయంకర రక్కసుడెవడో అయివుండాలి!'' అనుకుంటూ చంద్రవర్మ కుడిచేతితో కత్తిని బిగించి పట్టుకుని, ఎడమ చేతితో తనకు దొరికిన ఇనప గొలుసును పైకెత్తాడు. ఆ క్షణంలో ఆ ఇనప గొలుసు కూడా ఆత్మరక్షణకు ఉపకరించవచ్చునని అతడికి తోచింది. ఇంతలో దయ్యపు కుక్క, ఎదురుగా వున్న పొదల్లోంచి మరోసారి కర్ణకఠోరంగా మొరిగి, నోరు తెరిచి చంద్రవర్మ మీదికి శరవేగంతో రాసాగింది. —(ఇంకా వుంది)






# యముడి మహిషం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఎన్నో వైఫల్యాల తరవాత కూడా నువ్వు పట్టువదలక, యింత కాళరాత్రిలో శ్మశానంలో తిరుగుతున్నావంటే, అందుకు పరోపకారబుద్ధి కాక, నీ స్వార్థమే కారణం అనిపిస్తున్నది. అదే నిజమైతే, ఒక సంగతి గుర్తు చేయదలిచాను. ధనకనకవస్తు వాహనాలూ, కీర్తిప్రతిష్ఠలూ ఆశించి, ఎన్నో కఠోరశ్రమలకు లోనై, తీరా వాటిని పొందబోయే సమయంలో, ఏదో చపల బుద్ధి కారణంగా వాటిని తిరస్కరించిన వాళ్ళు చాలామంది వున్నారు. అలాంటి వాళ్ళల్లో ఒకడైన కుమారస్వామి అనే ఒక వైద్యుడి కథ చెబుతాను, శ్రమ తెలియ

## బేతాళ కథలు



కుండా విను,'' అంటూ యిలా చెప్ప సాగాడు :

వింధ్యారణ్య ప్రాంతాల్లోని ఒకానొక చిన్న గ్రామంలో భైరవస్వామి అనే వైద్యు డుండేవాడు. ఆయన ఏకైక సంతానం కుమారస్వామి. భైరవస్వామికి మంచి వైద్యుడన్న పేరుండేది. అయితే, ఆయన నివసించే గ్రామ సీమల్లోని ప్రజలంతా పేదవాళ్ళు కావడంతో, వైద్యవృత్తి ద్వారా ఆయన గడించిన ఆస్తి అంటూ ఏమీ లేదు. భైరవస్వామికి రాజాశ్రయం సంపా యించాలన్న కోర్కె వుండేది. కాని, వైద్య శాస్త్రంలో తానేమంత గొప్పవాణ్ణి కాదన్న వాస్తవం ఆయన ఎరుగు. అందువల్ల, పుట్టిపెరిగిన గ్రామంలోనే జీవిత కాల మంతా గడిపాడు.

భైరవస్వామికి ఒకసారి బాగా జబ్బు చేసింది. ఆయన కొన్నాళ్ళపాటు మంచం లోనే వుండి, యిక బతకనన్న అనుమానం కలగగానే కొడుకును పిలిచి, ''ఒరే, నా అంతిమ ఘడియలు సమీపించినై. నువ్వా పదహారు ఏళ్ళ వయసువాడివి. నీ కోసం అంటూ నేను మిగిల్చిన ఆస్తి ఏమీ లేదు. ఎందునా మిడిమిడి జ్ఞానం ప్రమాదకరం. ఈ వయసులో నువ్వు, నా నుంచి నేర్చిన వైద్యవిద్య ఎందుకూ పనికిరాదు. నువ్వు, మన గ్రామస్థుల సాయంతో వ్యవసాయ వృత్తి చేపట్టి సుఖంగా బతకాలన్నది, నా కోరిక,'' అన్నాడు.

కుమారస్వామి చాలా తెలివైనవాడూ, చురుకైనవాడే గాక ఎంతో పట్టుదలకల వాడు. వాడికి ఎంతో కాలంగా, ఏదో ఒక నాడు వైద్యశాస్త్రంలో నిధి అనిపించుకుని రాజధానీ నగరం చేరి, గొప్పగా ధనార్జన చేసి సుఖభోగా లనుభవించాలన్న ఆశ వున్నది.

ఆ కారణం వల్ల వాడు, తండ్రితో, ''నాన్నా, నువ్వప్పుడే చావును గురించి ఆలోచించకు. నీకు తిరిగి ఆరోగ్యం కలిగే అవకాశం వున్నది. ఒకవేళ దురదృష్ట వశాత్తూ అలా జరగకపోతే, నేను మాత్రం



వ్యవసాయవృత్తి నేర్చుకునే ప్రయత్నం చెయ్యను,'' అన్నాడు.

కొడుకు జవాబుకు భైరవస్వామి ఆశ్చర్యపోయి, ''అయితే, నీకున్న స్వల్ప జ్ఞానంతో రోగులకు చికిత్స చేయదలిచావా! అదెంత ప్రమాదకరమో ఆలోచించ లేదా ?'' అని అడిగాడు.

''వైద్యుడుగా, నాకున్న జ్ఞానం అతి స్వల్పం అని నేనెరుగుదును. కాని, ప్రాథమిక వైద్య విద్యార్థిగా, నాకున్న పరిజ్ఞానం చాలా అధికం. నేను ఏదో విధంగా మహేంద్రయోగి దగ్గిర శిష్యుడిగా చేరదలిచాను,'' అన్నాడు కుమారస్వామి.

ఈ మాటలు భైరవస్వామికి సంతోషం కలిగించినై. మహేంద్రయోగి అక్కడికి ఆరు ఆమడల దూరంలో వున్న అరణ్యంలో ఒక గురుకులం నడుపుతున్నాడు. ఆయన అనేక శాస్త్రాల్లో పారం ముట్టిన పండితుడు. ముఖ్యంగా యోగ శాస్త్రంలో ఆయనకు సాటిరాగలవారు లేరని చెప్పుకునేవారు. అయితే, ఆయన అంత తేలికగా ఎవరినీ తన శిష్యుడుగా చేర్చుకోడు. అందుకు చాలా పరీక్షలున్నవి.

తండ్రీకొడుకుల మధ్య యీ సంభాషణ జరిగిన వారం రోజులకు భైరవస్వామి చనిపోవడం జరిగింది. తండ్రికి అంత్యక్రియలు జరిపి, కుమారస్వామి మహేంద్రయోగి గురుకులానికి వెళ్ళాడు.

ఆయన కుమారస్వామిని ఏ విద్య నేర్వదలిచావని ప్రశ్నించి, వాడు వైద్య విద్య అనగానే కొన్ని పరీక్షలు పెట్టి తృప్తిపడి, తన శిష్యుడిగా చేర్చుకున్నాడు.

అప్పటికే మహేంద్రయోగి పండు ముదుసలి. కుమారస్వామి ఆయన వద్ద నాలుగేళ్ళపాటు వైద్య విద్య అభ్యసించి, ఆ శాస్త్ర విద్యార్థుల్లో ప్రథముడనిపించుకున్నాడు. ఆ కారణం వల్ల ఆయనకు వాడంటే ఎంతో వాత్సల్యం ఏర్పడింది.

ఒకనాడు యోగి విద్యార్థు లందరినీ సమావేశపరిచి, తాను మిగిలిన కొద్ది



కాలాన్నీ తపస్సులో గడపదలచినట్టు చెప్పి, "ఇక గురుకులం అంటూ లేదు. ఎవరి ఇళ్ళకు వాళ్ళు వెళ్ళవచ్చు. అయితే, అలా వెళ్ళేముందు ఆఖరు సారిగా నా నుంచి మీరు కోరేదేమిటో చెప్పండి!" అన్నాడు.

అయన తరవాత తన గదికి పోయి, ఒక్కొక్క విద్యార్థినే పిలిచి వాడి కోర్కె ఏమిటో తెలుసుకున్నాడు. కుమారస్వామి వంతు వచ్చింది. వాడు గురువు పాదాలకు భక్తితో నమస్కరించి, "స్వామీ, ఎన్నో తరాలుగా మా వంశంలోని వాళ్ళందరూ వైద్యవృత్తిని ఆశ్రయించి జీవించారు. కాని, ఏనాడూ దారిద్ర్యరేఖను అధిగమించి కాలం వెళ్ళబుచ్చింది లేదు!" అన్నాడు.

"అలాగా! సరే, నువ్వు కోరేదేమిటి?" అని అడిగాడు మహేంద్రయోగి.

"స్వామీ, జననం ఎంత సత్యమో, మృత్యువూ అంతే సత్యం. మనిషి చనిపోయేలోపల అతణ్ణి బాధించేవి, అతణ్ణి పీడించే వ్యాధులేకదా! ఆ వ్యాధులను నయం చేయగల దివ్యశక్తిని, నాకు ప్రసాదించండి," అన్నాడు కుమారస్వామి.

ఆ మాటలకు మహేంద్రయోగి ఆశ్చర్యపోయి, "నాయనా, ఆయుష్షు తీరే సమయం వస్తే, ఏ మందూ పని చెయ్యదు. అంటే, నేనిక్కడ చెప్పదలచింది రోగి శారీరక, మానసికస్థితి! ఆ సమయంలో మందు అనేది కేవలం ఉపశమనం లాంటిది. అయితే, నువ్వు కోరావు గనక ఒక శక్తిని ప్రసాదిస్తున్నాను. నువ్వు వైద్యం చేయబోయే రోగి తలగడ పక్కన యముడి వాహనమైన మహిషం కనిపిస్తే, ఆ రోగి ఆయుష్షు తీరిందని అర్థంచేసుకో. అప్పుడు, ఆ రోగికి వైద్యం వృథా. ఆ మహిషం, నీ ఒక్కడికే కనిపిస్తుంది," అన్నాడు.

కుమారస్వామి, గురువు యిచ్చిన వరానికి చాలా సంతోషిస్తూ, "స్వామీ, తమ దయకు కృతజ్ఞుణ్ణి. నా వైద్యవృత్తిలో ఒకే ఒకసారి, ఆ మహిషాన్ని పారదోలేం

దుకు ఏదైనా సాధనం చెప్పండి.'' అని అడిగాడు.

మహేంద్రయోగి ఒక్క క్షణం ఆలోచించి, ''నువ్వు, యముడి మహిషాన్ని పారదోలి రోగి ప్రాణాన్ని కాపాడవలసిన రోజు వస్తే, ఆ తరవాత నువ్వు వైద్య వృత్తినే మానవలసి వస్తుంది. ఆ సంగతి గుర్తుంచుకో! ఇక, ఆ మహిషాన్ని పారదోలే సాధనం యిది. నువ్వు మనస్సులో కనకదుర్గ వాహనమైన వ్యాఘ్రాన్ని తలచుకుని—'అదిగో, వ్యాఘ్రం! మహిషాసుర రాజా పారిపో,' అను. మహిషం అదృశ్యమై పోతుంది.'' అన్నాడు.

కుమారస్వామి, గురువుకు సాష్టాంగపడి, ఆయన పాదధూళి తలపై చల్లుకుని ఇంటికి తిరిగి వచ్చాడు. ఆ రోజు నుంచీ అతడు వైద్యుడుగా ప్రసిద్ధుడయ్యాడు.

కుమారస్వామి పరీక్షించి వైద్యం చేయడం ప్రారంభించిన రోగులందరూ స్వస్థత పొందసాగారు. అయితే, అతడు కొందరు రోగులను పరీక్షించగానే, ''ఇది చాలా విచిత్రమైన వ్యాధి. దీనికి వైద్య శాస్త్రంలో మందు లేదు,'' అనేవాడు.

ఆ సమయంలో అతడికి యముడి మహిషం రోగి తలగడ దగ్గిర కనిపించేది.

అతడు పూనుకుని వైద్యం చేసిన ప్రతి రోగీ బతికి బయటపడడంతో, కుమారస్వామి మంచి హస్తవాసి కలవాడుగా, మహా ఘన వైద్యుడుగా చలామణీ కాసాగాడు.





ఇలా వుండగా ఒకనాడు రాజుగారి దగ్గిర నుంచి కుమారస్వామికి వర్తమానం వచ్చింది. రాజకుమార్తె దీర్ఘవ్యాధితో బాధపడుతున్నది. ఎందరు వైద్యులూ ఆమెకు ఏమాత్రం స్వస్థత కలిగించలేక పోయారు. ఆమె వ్యాధి నయం చేసిన వాళ్ళకు రాజుగారు అగ్రహారాలతోపాటు, లక్షలవరహాలు బహుమానంగా యిస్తానని ప్రకటించాడు.

కుమారస్వామి వర్తమానం తెచ్చిన వాళ్ళ వెంట రాజధానికి వెళ్ళాడు. రాజుగారు అతణ్ణి స్వయంగా రాజకుమార్తె వున్న గదికి తీసుకుపోయాడు. కుమారస్వామి రాజకుమార్తె కేసి చూసేంతలో, అతడికి ఆమె తలగడ దగ్గిర యముడి మహిషం కనిపించింది.

అతడు మనసులో, 'అదిగో, వ్యాఘ్రం!' అనుకోబోయినవాడల్లా, ఒక క్షణం ఆగి ఆలోచించి, రాజుతో, ''మహారాజా, రాకుమార్తెకు, యీ దీర్ఘవ్యాధి నయం కాదు. వైద్యపరంగా చేసే మానవ ప్రయత్నాలు వృధా!'' అన్నాడు.

ఆ మాటలు వింటూనే రాజు మండి పడి, ''నీ హస్తవాసి మంచిదని విన్నాను. అంతేకాక, నువ్వు వైద్యం చేసిన ప్రతి రోగీ వ్యాధి నుంచి కోలుకున్నాడని అందరూ చెపుతున్నారు. ఆ కారణం వల్ల, నిన్ను పిలిపించాను. నువ్వు వెంటనే వైద్యం ప్రారంభించకపోతే, నిన్ను రాజ్యం నుంచి బహిష్కరిస్తాను,'' అన్నాడు.

అందుకు కుమారస్వామి ఎంతో వినయంగా, ''అంతా తమ యిష్టం, మహారాజా. నేను మాత్రం రాకుమార్తెకు వైద్యం చెయ్యలేను,'' అన్నాడు.

రాజు పట్టరానికోపంతో భటులనుపిలిచి, కుమారస్వామిని రాజ్యపు సరిహద్దుల అవతల వదిలి రావలసిందనీ, తిరిగి అతడెన్నడైనా రాజ్యంలో కనిపిస్తే, కారాగారంలో వేయవలసిందనీ ఆజ్ఞాపించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, కుమారస్వామి ప్రవర్తన గురించి, నీ అభి

ప్రాయం ఏమిటి? అతడు వైద్యవృత్తిలో బాగా ధనార్జనచేసి, సుఖభోగాలనుభవిం చాలనుకున్నాడుగదా. రాజకుమార్తె వ్యాధి కారణంగా అతడికి, అలాంటి అవకాశం వచ్చింది. ఆమె తల దగ్గిర యముడి మహిషం కనిపించగానే, అతడు కనకదుర్గ వాహనమైన వ్యాఘ్రం పేరు చెప్పి, దాన్ని పారదోలితే సరిపోయేది! అలా అతడు చేయకపోవడానికి కారణం, అతడి చపల బుద్ధేకదా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''కుమార స్వామికి బాగా ధనార్జన చెయ్యాలన్న కాంక్ష వున్న మాట నిజం. అందువల్లనే అతడు, మహేంద్రయోగిని ఒకే ఒకసారి ఆ మహిషాన్ని పారదోలేందుకు ఉపాయం చెప్పమని అడిగాడు. అలా అడగడంలో అతడి ఉద్దేశం ఏమిటంటే—ఏదో ఒక నాడు, ఏ కోటీశ్వరుణ్ణో మృత్యుముఖా న్నుంచి కాపాడి, లక్షల విలువైన బహు మానం సంపాయించవచ్చునని. అయితే, యోగి చెప్పిన విధంగా, ఆనాటితో అతడు వైద్యవృత్తికి అనర్హుడవుతాడు! నిజాయితీ గల వైద్యుడు ధనార్జన మీదకన్న, తాను చేబట్టిన చికిత్స విజయం పైనే ఎక్కువ దృష్టి నిలుపుతాడు. కుమారస్వామి ఎంతో కాలంగా వైద్యవృత్తిలో వుంటూ ఎందరో రోగులకు వ్యాధి నివారణచేసి, పది మంది లోనూ మంచి వైద్యుడుగా పేరు తెచ్చు కున్నాడు. రాజకుమార్తెకు వైద్యం చేయడ మంటే—ఆ తరవాత, ఆ వృత్తికి శాశ్వ తంగా దూరమైపోవడమేగదా. తన ఒక్కడి సుఖం కోసం, ఎందరో వ్యాధి గ్రస్తులను మృత్యువుపాలు చేయడం యిష్టం లేకే, కుమారస్వామి రాజ కుమార్తెకు వైద్యం చేయనన్నాడు. ఇందుకు కారణం, అతడి చపలబుద్ధి కాదు; త్యాగబుద్ధి!'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# బాణంగురి

నలభై ఏళ్ళ వయసువాడైన నిర్లిప్తుడనే వాడికి, హఠాత్తుగా జీవితంలో తానేమీ సాధించలేదనే ఆలోచన వచ్చింది. వాడు చూస్తూండగానే ఎందరో లక్షాధికారులయారు; కళాకారులయారు. కీర్తిప్రతిష్ఠలు గడించారు. తాను మాత్రం అనామకుడుగానే వుండిపోయాడు!

నిర్లిప్తుడు యిక బతకడం వృధా అని భావించి, ఏ పులివాతో పడి చావదలిచి అడవికి వెళ్ళాడు. అక్కడ ఒక సాధువు వాడికి ఎదురుపడి, "క్రూరమృగాలు తిరిగే, యీ అడవికి ఎందుకొచ్చావు?" అని ప్రశ్నించాడు.

"స్వామీ, నేను జీవితంలో ఏమీ సాధించలేకపోయాను. అందువల్ల విరక్తిచెంది, చావాలని యిక్కడికి వచ్చాను," అన్నాడు నిర్లిప్తుడు.

సాధువు చిరునవ్వు నవ్వి, "ఏమీ సాధించలేకపోయినందుకు బాధపడుతున్నావు, బాగానే వున్నది. మరి జీవితంలో ఫలానిది సాధించాలని ఎప్పుడైనా అనుకున్నావా?" అని అడిగాడు.

నిర్లిప్తుడు లేదని తల ఊపాడు. అప్పుడు సాధువు, "బాణం గురి పెట్టకుండా లక్ష్యానికి తగలలేదని బాధపడడం అవివేకం!" అన్నాడు.

సాధువు మాటలతో నిర్లిప్తుడికి కనువిప్పు కలిగింది. వాడు మరెన్నడూ ఏమీ సాధించలేదని బాధపడకుండా, ఎంతో కొంత సాధించడానికి ప్రయత్నించాడు. —ఎన్. శివనాగేశ్వరరావు






# ఉద్యోగ బాధ్యత

సిరిపురంసంస్థానంలో సలహాదారుడి పదవి ఒకటి ఖాళీ అయ్యింది. గౌరాంగుడు, గంభీరుడు అనే వాళ్ళు, జమీందారు దగ్గిరకు వచ్చి, ఆ ఉద్యోగం తమకు యివ్వవలసిందిగా కోరారు.

జమీందారు ముందుగా గౌరాంగుణ్ణి తన కచ్చేరీగదికి తీసుకుపోయి, "అప్ప చెప్పిన విధులన్నీ, ఒక్క పొరబాటయినా చెయ్యకుండా నిర్వహించగల సమర్థత, నీకున్నదా ?" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు గౌరాంగుడు "అయ్యా, ఇరవై సంవత్సరాలుగా, ఎందరో సంస్థానాధీశుల దగ్గిర పని చేసిన అనుభవం, నాకున్నది. నా విధి నిర్వహణలో ఒక్క తప్పు జరగలేదు. నన్ను మెచ్చుకుంటూ, వారందరూ యిచ్చిన పత్రాలే అందుకు సాక్ష్యం." అంటూ కొన్ని కాగితాలను జమీందారు కిచ్చాడు.

జమీందారు వాటిని పక్కనే వున్న దివానుకు యిచ్చి, గంభీరుణ్ణి పిలిపించాడు. ఆయన గంభీరుణ్ణి, గౌరాంగుణ్ణి అడిగిన ప్రశ్నే అడిగాడు.

దానికి గంభీరుడు, "అయ్యా, ఒక్క పొరబాటయినా దొర్లకుండా, అన్ని విధుల్నీ నిర్వహించడం సాధ్యం కాని పని. అందువల్ల, తమకు అలాంటి హామీ యివ్వలేను," అన్నాడు.

జమీందారు అతణ్ణి మందలిస్తున్నట్టుగా, "అలాంటప్పుడు, ఇటువంటి ఉన్నతపదవి కావాలంటూ ఎగబడడం తప్పుకాదా !" అన్నాడు.

"క్షమించండి! చేసిన పనిలో పొరబాటేదైనా జరిగినప్పుడు, దాన్ని సకాలంలో సరిదిద్దుకుని, మళ్ళీ అంతా సక్రమంగా జరిగిపోయేట్టు చూడగల సమర్థత, నాకున్నది. పొరబాట్ల ద్వారా నేర్చుకున్న

జొన్నలగడ్డ రత్న

పాఠాలూ, అనుభవాలూ—ఆ తరవాత మనిషికి ఎంతో ఉపయుక్తం కాగలవన్న సంగతి, మీకు తెలియంది కాదుగదా,'' అన్నాడు గంభీరుడు.

జమీందారు అతణ్ణి రేపే వచ్చి ఉద్యోగంలో చేరమని చెప్పి, పంపివేశాడు.

జమీందారు పక్కనే వున్న దివానుకు, జమీందారు గంభీరుడికి ఉద్యోగం యివ్వడం ఆశ్చర్యం కలిగించింది.

''గౌరాంగుడికి చాలామంది మంచి యోగ్యతాపత్రా లిచ్చారు. అతడు లోగడ నిర్వహించిన పదవుల్లో, ఒక్క పొరబాటు కూడా చేసినట్టు కనబడదు. తమరు అలాంటి వాణ్ణి వదిలి, ఏ అర్హతలు చూసి గంభీరుడికి ఉద్యోగం యిచ్చారో, అర్థం కావడంలేదు,'' అన్నాడు దివాను.

దివాను సందేహం విని జమీందారు, ''గౌరాంగుడు విధి నిర్వహణలో, తానెన్నడూ, ఒక్క తప్పు కూడా చేయలేదంటున్నాడు. ఆ మాట నమ్మడం ఎలా! అలాంటివాళ్ళు, స్వయంగా ఏ పనీ ముట్టుకోకుండా సహాయకుల మీద ఆధారపడతారు. ఏవైనా పొరబాట్లు జరిగితే, వాటిని వాళ్ళ మీద రుద్దుతారు. ఒక్క పొరబాటు కూడా దొర్లకుండా బాధ్యత గల పదవుల్ని అంతకాలం నిర్వహించడం, ఎవరికీ సాధ్యపడదు. ఏమంటారు?'' అన్నాడు.

దివాను జమీందారు చెప్పినదాంట్లో ఎంతో వాస్తవం వున్నదని గ్రహించి, ''అవును, మీరన్నది నిజం,'' అన్నాడు.

''ఏవైనా బాధ్యతలు నిర్వహించేటప్పుడు, పొరబాట్లు జరిగే అవకాశం వున్నదని గుర్తించినవాడు, గంభీరుడు. అలాంటివాటిని కప్పిపుచ్చడంకన్న, సరిదిద్దుకోవడం ప్రయోజనకరమని అతడికి తెలుసు. ఆ కారణం వల్లనే, సలహాదారుగా వుండడానికి అతడు అర్హుడని నిర్ణయించాను.'' అన్నాడు జమీందారు.

గంభీరుడు, జమీందారు తనకిచ్చిన పదవిలో మంచి పేరు తెచ్చుకుని, కొంత కాలం తరవాత సంస్థానానికి దివానుగా నియమించబడ్డాడు.





# మూగవాడు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలిస్తున్న కాలంలో మద్రదేశపు రాజు కూతురు చంద్రాదేవి ఆయనకు పట్టపు రాణిగా ఉండేది. ఎంత కాలం గడిచినా ఆమెకు సంతానం కలగలేదు. యువరాజు లేనందుకు ప్రజలు విచారించి, రాజు వద్దకు వెళ్ళి, పిల్లలు కలగటానికి ఏవైనా వ్రతాలు చెయ్యమన్నారు.

ఆ ప్రకారమే చంద్రాదేవి అనేక వ్రతాలు చేసింది. ఆమె ఒక పౌర్ణమీ పుణ్యదినాన ఉపోషం ఉండి, "నేనే శీలవతినైతే నాకు ఒక మగపిల్లవాడు కలగాలి!" అనుకున్నది.

దేవతలకు రాజైన ఇంద్రుడు చంద్రాదేవి కోరిక నెరవేర్చటానికి నిశ్చయించి, ఆమె గర్భవాసాన జన్మించగలవా డెవడా అని ఆలోచించేసరికి ఆయనకు బోధిసత్వుడు జ్ఞాపకం వచ్చాడు.

బోధిసత్వుడు ఒకప్పుడు కాశీరాజుగా జన్మించి, ఇరవై ఏళ్ళు పరిపాలించి, ఆ ఇరవై ఏళ్ళ పరిపాలనలోనూ తాను చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తంగా ఎనభై వేల ఏళ్ళు ఉష్ణదనరకం అనుభవించి, తరవాత దేవలోకంలో ఉండి, అక్కడ తన కాలం తీరిపోగా ఊర్ధ్వలోకాలకు వెళ్ళిపోవటానికి సిద్ధమవుతున్నాడు.

ఇంద్రుడు ఆ సమయంలో బోధిసత్వుడి వద్దకు వెళ్ళి, "మిత్రమా, నీవు వెళ్ళి మానవలోకంలో జన్మించినట్టయితే ఎంతో పుణ్యం సంపాదించటమే గాక, మానవ కోటిని ఉద్ధరించ గలుగుతావు. కాశీరాజూ, ఆయన భార్య చంద్రాదేవీ పుత్రుణ్ణి కోరి ఎన్నో వ్రతాలు చేస్తున్నారు. వారి కుమారుడివై జన్మించు!" అని కోరాడు. అందుకు బోధిసత్వుడు సమ్మతించాడు.



వద్దకు వెళ్ళి ఏదైనా ఒక వరం కోరుకోమన్నాడు. ఆమె సమయం వచ్చినప్పుడు కోరుకుంటానన్నది.

పిల్లవాడికి బారసాల చేసి తేమియుడని పేరు పెట్టుకున్నారు. ఆ సమయంలో రాజు సిద్ధాంతులను, "పిల్లవాడికి అరిష్టాలేమైనా ఉన్నాయా?" అని అడిగాడు. వారు లక్షణాలన్నీ పరిశీలించి, "రాజా, ఈ కుర్రవాడికి ఎట్టి ప్రమాదాలూ లేవు. పూర్ణాయువవుతాడు!" అని చెప్పారు.

తేమియుడు ఒక నెల వయసు గలవాడై ఉండగా, అతన్ని చక్కగా అలంకరించి సభలో వున్న రాజుగారి వద్దకు తీసుకువెళ్ళారు. రాజు తన కొడుకును ఒడిలో కూచోబెట్టుకుని ఆడించసాగాడు. ఈ సమయంలో నలుగురు దొంగలను రాజుగారి ఎదట విచారణకు తెచ్చారు. రాజుగారు నలుగురినీ విచారించి, ఒక దొంగను వెయ్యి కొరడాదెబ్బలు కొట్టమనీ, రెండవవాణ్ణి యావజ్జీవం కారాగృహంలో ఉంచమనీ, మూడవవాణ్ణి ఈటెలతో పొడవమనీ, నాలుగవవాణ్ణి కొరత వెయ్యమనీ ఉత్తరువిచ్చాడు.

పూర్వజన్మ జ్ఞానం గల బోధిసత్త్వుడు ఇదంతా చూసి, "అయ్యో, నా తండ్రి రాజు అయిన కారణంచేతగదా నరకాన్ని కోరి తెచ్చుకునే పనులు చేస్తున్నాడు.

బోధిసత్త్వుడు చంద్రాదేవి గర్భం ప్రవేశించిన సమయానే అతని అనుచరులైన దేవతలు అయిదువందలమంది కాశీరాజు పరివారంలోని వారి భార్యల గర్భాలలో ప్రవేశించారు.

సకాలంలో బోధిసత్త్వుడు చంద్రాదేవి గర్భాన అనేక శుభలక్షణాలతో జన్మించాడు. ఆ రోజునే మిగిలిన అయిదు వందలమందీ పుట్టారు. వారందరూ తన కుమారుడితోబాటు పెరిగి, అతనికి అనుచరులుగా ఉండాలని రాజు ఉత్తరువిచ్చాడు. తన కుమారుడికి పాలివ్వటానికి అరవైనాలుగుమంది దాదులను ఏర్పాటు చేశాడు. తరవాత ఆయన తన పట్టపురాణి

నేను ఒకప్పుడు ఇరవై ఏళ్ళు రాజుగా ఉన్నందువల్ల ఎనభైవేల ఏళ్ళు ఉష్ణద నరకం అనుభవించాను. మళ్ళీ నేనీ దొంగల వంశంలో జన్మించానేమిటి? తాను దొంగ అన్నది తెలియక నా తండ్రి నలుగురు దొంగలకు అతి క్రూరమైన శిక్షలు విధించాడు. నేను కూడా రాజునైనానంటే నాకు నరకప్రాప్తి తప్పదు!'' అనుకున్నాడు.



అది మొదలు అతనికి ఈ దొంగ బ్రతుకు తప్పించుకోవటం ఎలాగా అని విచారం పట్టుకున్నది. అతని బంగారు శరీరం వాడినట్టయిపోయింది. అప్పుడతనికి తన పూర్వజన్మ తాలూకు తల్లి కనిపించి, ''భయపడకు, నాయనా, ఈ పాపపు జీవితం నుంచి తప్పించుకోవాలంటే, చెవిటివాడి లాగా, మూగవాడి లాగా, కాళ్ళు లేనివాడి లాగా, మతి లేని వాడి లాగా నటించు!'' అని హెచ్చరించింది. తేమియుడు అలాగే చేయ నిశ్చయించాడు.

రాజుగారి ఆజ్ఞప్రకారం బోధిసత్వుడున్న చోటనే మిగిలిన అయిదువందల మంది పిల్లలనూ ఉంచారు. మిగిలిన వారంతా ఆకలి కాగానే పాలకోసం ఏడవసాగారు. కాని, వారందరిలో బోధిసత్వుడు ఒక్కడే ఏడవలేదు: ''ఈ లోకంలో నరకం అనుభవించటం కన్న ఆకలికి మాడి చావటం చాలా రెట్లు నయం.'' అనుకున్నాడు.

దాదులు వెళ్ళి రాజకుమారుడు పాల కోసం ఏడవటం లేదని రాణీతో చెప్పారు. ఆమె ఈ సంగతి రాజుతో అన్నది. రాజు బ్రాహ్మణులను పిలిపించి వారి సలహా అడిగాడు.

''పిల్లవాడు పాలకోసం ఏడవనవసరం లేదు. సరి అయిన వేళకు పాలిస్తే గుటగుటా తాగేస్తాడు,'' అన్నారు బ్రాహ్మణులు. దాదులు అలాగే చేస్తూ వచ్చారు. కాని పరీక్షకు గాను వారు ఒకసారి పాలు ఇవ్వటం మానేస్తే పిల్లవాడు ఏడిచేవాడు



కాదు. ఇది వారికి ఆశ్చర్యం కలిగించింది. అదీ కాక, మిగిలిన పిల్లల్లా అతను చేతులూ, కాళ్ళూ కదిలించి ఆడుకోలేదు, కేరింతలు కొట్టలేదు. అతని గొంతు నుంచి ఏ చప్పుడూ లేదు. చిటికెలు వేస్తే విననట్టుగా కనబడేవాడు. దీనికి కారణమేమిటో ఎవరూ తెలుసుకోలేకపోయారు.

ఈ విధంగా ఒక ఏడాది గడిచింది. ఒకనాడు దాదులు మిఠాయి తెచ్చి పిల్లలందరి మధ్యా పెట్టి, ''తినండి!'' అని చాటుకు వెళ్ళి ఏం జరుగుతుందో అని చూడసాగారు. మిగిలిన పిల్లలందరూ ఎగబడి మిఠాయి తిన్నారు. ఒకరి చేతిలోది ఒకరు లాక్కున్నారు. తేమియుడు మాత్రం కొంచెం కూడా ఆసక్తి కనబరచలేదు. ఇది చూసి రాణి గుండె చెరువైపోయింది. ఆమె మిఠాయి తెచ్చి, ''తిను, తండ్రీ!'' అని తన చేత్తో అతని నోట పెట్టింది.

అయిదేళ్ళు గడిచాయి. అయిదేళ్ళు నిండిన పిల్లలకు నిప్పు భయం తెలుస్తుంది. నిప్పు చూసి తేమియుడు భయపడతాడేమో చూస్తామని రాజుగారు పిల్లలకోసం ఒక పెద్ద పాక వేయించి, దానిపైన తాటాకులు వేయించారు. అందులో పిల్లలందర్నీ ఉంచారు. తరవాత ఆ పాకకు నిప్పు అంటించారు. నిప్పు చూడగానే మిగిలిన అయిదు వందలమంది పిల్లలూ భయపడి పారిపోయారు. తేమియుడు మాత్రం, ''నరకంలో మగ్గటం కన్న ఈ మంటలలో చావటమే నయం,'' అనుకుని నిర్లిప్తుడుగా వుండిపోయాడు. మంటలు అతనిదాకా వచ్చే సమయానికి అతన్ని ఎవరో ఎత్తుకుని ఇవతలికి రావలిసి వచ్చింది.

తేమియుడు ఏడేళ్ళవాడయాడు. కొన్ని తాచుపాములకు కోరలు పీకేసి, మూతులు కుట్టి పిల్లలందరూ వున్నచోట వదిలారు. మిగిలిన పిల్లలందరూ బెదిరి పారిపోయారు గాని, తేమియుడు కూచున్న చోటి నుంచి కదలలేదు. పాములు అతని శరీరం నిండా పాకాయి, అతని నెత్తిన

పడగలు విప్పి పట్టాయి. అయినా అతను చలించలేదు.

అతని కాళ్ళలో ఏ లోపమూ లేదు. చెవులూ, నోరూ కూడా వుండవలసినట్టుగానే వున్నాయి. అతను ఎందుకు కదలడో, ఎందుకు మాట్లాడడో, ఎందుకు వినడో ఎవరూ ఊహించలేకపోయారు. పిల్లలు వినోదం కోసం నాటకాలాడారు. వినోదం చూసి మిగిలిన పిల్లలందరూ నవ్వారు గాని తేమియుడు నవ్వలేదు. ఒకడు కత్తితో నృత్యం చేస్తూ, "ఏడీ ఆ రాజకుమారుడు? వాణ్ణి శిరశ్ఛేదం చేస్తాను!" అంటూ కత్తిచాచి తేమియుడి మీదికి భయంకరంగా వచ్చాడు. మిగిలిన పిల్లలు కెవ్వున అరిచి పారిపోయారు, కాని తేమియుడు కాస్త కూడా చలించలేదు. నృత్యగాడు తన నటన చాలించి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

ఈ విధంగా అతనిలో చైతన్యం కలిగించటానికి ఎన్నో చేశారు. అతని చుట్టూ అకస్మాత్తుగా శంఖాలు ఊదారు; అదే పనిగా డప్పులు వాయించారు; అతని శరీరానికి బెల్లపు నీరు పట్టించి మీద ఈగలు వాలి బాధ పెట్టేటట్టు చేశారు; అనేక రోజులపాటు పళ్ళు తోమక, నీళ్ళు పొయ్యక ఉంచారు; అతని శరీరం నుంచి దుర్గంధం పుట్టింది; అప్పుడు అందరూ




అతన్ని హేళన చేస్తూ, "ఏమిటిది? లేచి వెళ్ళి నీళ్ళు పోసుకోరాదా? శుభ్రంగా ఉండాలన్న జ్ఞానం కూడా లేదూ?" అన్నారు. ఆఖరుకు అతని మంచం కింద మంటలు పెట్టారు.

ఆ మంటలకు అతని శరీరం బొబ్బలెక్క సాగింది. "ఆ మంటలకంటే ఈ మంటలే నయం," అనుకుని తేమియుడు ఏమాత్రమూ చలించలేదు.

అతను చలించకపోయినా, లేకలేక కన్న అతని తల్లిదండ్రులు చలించారు. వారి కడుపు తరుక్కుపోయింది. వారీ పరీక్షలన్నీ కట్టిపెట్టించి, కొడుకు వద్దకు వెళ్ళి ప్రాధేయపడ్డారు. "నాయనా, నీలో

ఏ అవలక్షణమూ లేదు. మాకు తెలుసు! ఎన్నో నోములు నోచి నిన్ను కన్నాం. నువ్విలా మన్నుడిన్న పాములాగా పడి వుండటం మాకు అవమానంగా వుంది! లేచి మామూలు మనిషిలాగా తిరుగు, నాయనా!" అని ఎన్నోసార్లు వేడుకున్నారు. అయినా లాభం లేకపోయింది.

తేమియుడికి పదహారేళ్ళు నిండాయి. "ఎంత కాళ్ళు లేనివాడైనా, మూగవాడైనా, చెవిటివాడైనా, యుక్తవయసు వచ్చాక ప్రేమ అన్నది కలగకుండా ఉండదు. అందుచేత మనవాణ్ణి ఆకర్షించటానికి నాట్యగత్తెలను నియోగిస్తాను. వారందరూ వాడి చుట్టూ ఆడుతూ, నృత్యం చేస్తూ వుంటే, ఒకతె అయినా వాడి మనస్సును ఆకర్షించవచ్చు. అలా ఆకర్షించినదాన్ని వాడికి పట్టపు రాణిగా చేస్తాను!" అన్నాడు రాజు.

తేమియుడికి పన్నీటస్నానం చేయించి, మంచి బట్టలు ధరింపజేసి, ఇంద్రభవనం లాటి భవనంలో హంసతూలికా తల్పం మీద పడుకోబెట్టారు. ఆ భవనం నిండా పూలూ, అత్తరుపులూ, సాంబ్రాణీ, మద్యపానీయాలూ అమర్చారు. అక్కడికి అనేకమంది నృత్యం చేసే యువతులు వచ్చారు. వారు తమ ఆటలతో సూ, పాటలతో సూ, రాజకుమారుణ్ణి రంజింపజేయటానికి విశ్వప్రయత్నాలు చేశారు. కాని అతను ఆ నృత్యం చేసే యువతుల గాలి సోకితే ఏమవుతుందోనని ఊపిరి కూడా పీల్చక కొయ్యలాగా అయిపోయాడు.

చివరకా యువతులు ప్రాణం విసిగి రాజుగారి వద్దకు వెళ్ళి, "మీ కుమారుడు మనిషి కాడు, రాక్షసి అయివుండాలి. మేము నాట్యం చేస్తూ దగ్గిరికి పోతే నిలువునా కొయ్యబారిపోయాడు!" అని చెప్పారు.

ఈ విధంగా పదహారేళ్ళపాటు సాగించిన ప్రతి పరీక్షా బూడిదలో పోసిన పన్నీరయిపోయింది. తేమియుడి రహస్యమేమిటో ఎవరికీ తెలియలేదు.

[ముగింపు వచ్చే సంచికలో]






మన దేవాలయాలు :

# అమరనాథ్

ఒకనాడు పార్వతీదేవి శివుణ్ణి చూసి, "పరమేశ్వరా, మీరు కపాల హారాన్ని ఎందుకు ధరిస్తారు?" అని అడిగింది. ఆ మాటకు పరమశివుడు "ఇది పూర్వ జన్మలోని నీ కపాలమే," అన్నాడు. దానికి పార్వతి, "మీరు మరణించనప్పుడు నేను మాత్రం ఎందుకు మరణించాను?" అన్నది ఆశ్చర్యంగా.

జనన మరణాల రహస్యం గురించి, శివుడు పార్వతికి తెలియజేయాలను కున్నాడు. దానికి క్రిమికీటకాలు కూడా లేనటువంటి రహస్య ప్రదేశం కావాలి. అటువంటి స్థలాన్ని కనుగొనడానికి రుద్రగణాలు దశదిశలా వెతకసాగారు.





చివరికి వారు హిమాలయాలలోని ఒక గుహను కనుగొన్నారు. ఆ గుహకు దరిదాపుల్లో ఎక్కడా ఒక్క ప్రాణి కూడా కనిపించలేదు. శివపార్వతులు ఆ లోయులోకి ప్రవేశించారు. అక్కడ శివుడు పార్వతికి జనన మరణాల రహస్యాన్ని వివరించ సాగాడు.




శివుడి మాటలను వింటూ పార్వతి ఒక దశలో అలాగే నిద్రపోయింది. అయినా తన మాటలకు ఎవరో ఊకొట్టడం గమనించిన శివుడు ఆశ్చర్యం చెందాడు. పార్వతిని తట్టి లేపి, తన మాటలకు ఊకొట్టిన ప్రాణి కోసం చుట్టుపక్కల కలయచూశాడు.

శివపార్వతులు కూర్చున్న బండ కింద ఉన్న కన్నంలో నుంచి ఒక చిన్న చిలుక రివ్వున బయటకు వచ్చింది. ఆ కన్నంలో గుడ్డుగా ఉండి, పెరిగి పిల్లగా మారిన ఆ చిలుక, శివుడు పార్వతికి ఉపదేశించిన రహస్యాన్నంతా విని, బయటకు ఎగిరిపోయింది.





సుదూర ప్రాంతంలో ఉన్న వ్యాస మహర్షి కుటీరం ముందు కూర్చుని వ్యాసుడి భార్య తల దువ్వుకుంటూ ఉండగా, ఆ చిలుక అక్కడికి వచ్చి ఆమెలో లీనమైపోయింది. తరవాత కొన్నాళ్ళకు ఆ చిలుకే ఆమె కడుపున పుట్టి, శుకు డనే మునిపుంగవుడుగా కీర్తిగాంచాడు.

శివుడు పార్వతికి రహస్యాన్ని తెలియజేసిన ఆ గుహ పవిత్రస్థలమయింది. కొన్ని శతాబ్దాలు గడిచాయి. ఒకనాడు యువకుడయిన ఒక గొర్రెలకాపరి, మంద నుంచి తప్పించుకుని పోయిన గొర్రెపిల్లను తరుముకుంటూ అటుగా వెళ్ళాడు.






ఉన్నట్టుండి అతడు ఆ గుహలో రూపొంది ఉన్న లింగరూపాన్ని చూసి ఆశ్చర్యపడ్డాడు. మరుక్షణమే అతని మనసులో ఎంతో శాంతి, భక్తి ఏర్పడ్డాయి. అతడు కాశ్మీర రాజు వద్దకు వెళ్ళి, ఆ విషయం తెలియజేశాడు.

కాశ్మీరరాజు పరివారంతో ఆ స్థలానికి వచ్చాడు. అక్కడ ఉన్న మునులు, రాజుకు ఆ స్థల పవిత్రతను గురించి వివరంగా తెలియజేసి, దానిని అలాగే ప్రకృతి రక్షణకు వదిలివేయమని చెప్పారు.





ప్రతి సంవత్సరమూ, ఆగస్టు నెలలో చాలామంది యాత్రికులు ఈ గుహకు నలభై ఆరు కిలోమీటర్ల దూరంలో ఉన్న పహల్గన్ వద్ద గుమికూడుతారు. కాశ్మీర్‌లోని ధర్మార్థసంఘ అధిపతి నాయకత్వంలో, భక్తులు గుహ కేసి యాత్ర సాగిస్తారు.

అత్యద్భుత సౌందర్య నిలయమైన కొండలగుండా, కోనలగుండా, సెలయేళ్ళనూ, తటాకాలనూ దాటుకుంటూ, భక్తులు నాలుగయిదు రోజులు ప్రయాణం చేసి, ఈ గుహ సమీపానికి చేరుకుంటారు.






అక్కడ ప్రకృతి సిద్ధంగా మంచు ముక్కలతో రూపొందే పెద్ద శివలింగాన్ని భక్తులు సందర్శిస్తారు. ప్రప్రథమంగా భృగుమహర్షి ఆ లింగాన్ని దర్శించినట్టు చెబుతారు. ఆనాటి నుంచి, తరతరాలుగా వేలకొలది భక్తులు పవిత్రమైన అమరనాథ్ క్షేత్రాన్ని సందర్శిస్తున్నారు.



# అస్థానతిండిపోతు

రంగాపురంలో వుండే చింతాలుడు పరమ సోమరి. ఏ పని చేయాలన్నా వాడికి బద్ధకం. ఆ కారణంవల్ల, వాడు కొందరు అమాయకులచుట్టూ చేరి, తను చాలా గొప్పవాడినని ప్రగల్భాలు పలుకుతూండేవాడు.

ఒకసారి ఆ అమాయకుల్లో ఒకడు వాణ్ణి, "ఏమిటి, నీ గొప్పతనం ? ఎప్పుడూ ఏ చెట్టుకిందో గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోవడమేగదా, నీ పని," అన్నాడు.

"నువ్వు రోజంతా కష్టపడి పని చేస్తావు గదా, ఒక్కసారిగా ఎన్ని జామకాయలు తినగలవు ?" అని చింతాలుడు వాణ్ణి అడిగాడు.

అమాయకుడు కొంచెంసేపు ఆలోచించి, "పదిహేను," అన్నాడు.

"నేను నలభై తినగలను, తెలుసా ?" అన్నాడు చింతాలుడు.

అమాయకుడు ఆశ్చర్యపోయి, "తిను చూద్దాం !" అన్నాడు.

"జామకాయలు తీసుకురండి. అలాగే తినేస్తాను," అన్నాడు చింతాలుడు.

అమాయకుడు తన స్నేహితులను వెంట బెట్టుకుని వెళ్ళి, నలభై జామకాయలూ పోగుచేసి తెచ్చాడు. చింతాలుడు ఏకబిగిని నలభై జామకాయలూ తినేశాడు.

అమాయకుడు, చింతాలుడి వంక జాలిగా చూసి, "పాపం, నీకింత తిండి పుష్టి వుంటే కష్టం ! అసలే కష్టపడి పని కూడా చేయలేవు. తినడానికి డబ్బె క్కణ్ణించి వస్తుంది ?" అన్నాడు.

"కష్టపడి పని చేయకపోతేనే, యింత తింటున్నానుగదా ! కష్టపడ్డానంటే, నా ఆకలి యింకా పెరిగిపోదూ ? అందుకే నేను కష్టపడి పని చెయ్యడం లేదు," అన్నాడు చింతాలుడు.

"వసుంధర"



చింతాలుడు చెప్పింది విని, అమాయకుడు గ్రామాధికారి దగ్గిరకు వెళ్లి సంగతి చెప్పి, "వాడి తిండిపుష్టి గొప్పది. కొంత కాలంపాటు మనమంతా కలిసి పోషించామంటే, వాడు మన గ్రామానికి పేరు తెస్తాడు," అన్నాడు.

గ్రామాధికారికి చింతాలుడి పథకం అర్థమైంది. వాడి కెలాగైనా బుద్ధి చెప్పాలనుకున్నాడాయన. కొంతకాలం క్రితం జమీందారు దగ్గిర ఆస్థాన తిండిపోతుగా వున్న సపుష్టి అయనకు తెలుసు.

గ్రామాధికారి, సపుష్టికి కబురు పెట్టి రప్పించి, తర్వాత చింతాలుడిని పిలిచి, "నీకు ఆస్థాన తిండిపోతు పోటీలలో పాల్గొనాలని వున్నదట, నిజమా? సరే, అందుకు మేమంతా కలిసి నిన్ను తయారు చేయాలనుకుంటున్నాం. అయితే, నీ సామర్థ్యం ఏపాటో ముందు పరీక్షించాలి గదా! ఇదుగో, ఈ సపుష్టి రెండు సంవత్సరాల క్రితం, తిండి పోటీలలో నెగ్గి, ఏడాదిపాటు జమీందారు పోషణలో వున్నాడు. నువ్వితణ్ణి తిండి పోటీలో ఓడించగలిగితే, గ్రామం నిన్ను తిండి పోటీకి తయారు చేస్తుంది," అన్నాడు.

చింతాలుడు పోటీకి సిద్ధపడ్డాడు. "నువ్వు బక్కప్రాణిలా వున్నావు. నాతో పోటీపడలేవు," అన్నాడు సపుష్టి.

"అవును, నిజమే పాపం," అని జాలిపడ్డాడు అమాయకుడు.

"నావంటివాణ్ణి పని చేయమనడం, అన్యాయం. నేను తిండి పోటీలలో నెగ్గి, మన గ్రామానికి పేరు తెస్తాను. రోజూ అభ్యాసానికి, నాకు బాగా తిండి పెట్టి పోషించండి," అన్నాడు చింతాలుడు.

వాడు పోటీల మాట తెచ్చినదెందుకంటే—ఏటా పొరుగూరి జమీందారు తిండి పోటీలు నిర్వహిస్తాడు. అందులో నెగ్గినవాణ్ణి ఏడాదిపాటు, ఆయన పోషిస్తాడు. అలా పోటీలలో నెగ్గి జమీందారు గారి ఆస్థాన తిండిపోతు కావాలని చింతాలుడు కలలుకంటున్నాడు.

"ఏకబిగిని నలభై జామకాయలు తిన్నాను. నా సంగతి నీకు తెలియదు," అన్నాడు చింతాలుడు కోపంగా.

"అయితే సరే! రేపు నీకూ, నాకూ గారెల పోటీ. నువ్వెన్ని తినగలవో, అన్నింటికి నేను పది ఎక్కువ తింటాను," అన్నాడు సపుష్టి.

మర్నాడు పోటీకి ఏర్పాట్లు జరిగాయి. ముందు చింతాలుడు తినడం ప్రారంభించి, రెండు వందల గారెలు తిన్నాడు. అంతా వాడి తిండి పుష్టికి ఆశ్చర్యపోయారు. తర్వాత సపుష్టి గారెలు తినడం మొదలు పెట్టాడు. వాడు అవలీలగా నూట ఎనభై గారెలు తినేసరికి చింతాలుడు భయపడ్డాడు. అప్పుడు వాడు వంటవాడికి సైగ చేశాడు—గారెలు పెద్దవిగా చేయమని.

చింతాలుడు అందిస్తూంటే, సపుష్టి ఆ పెద్ద గారెలను కూడా మరొక పది సునాయాసంగా తినేశాడు. చింతాలుడు మరింతగా భయపడిపోయి, సపుష్టి తినే గారెల లెక్క తప్పుగా చెప్పసాగాడు. ఇందుకు వాడి చుట్టూ చేరిన అమాయకులు సహకరించారు.

ఇందువల్ల, సపుష్టి తిన్న గారెల సంఖ్య రెండు వందలు కావడానికి చాలా సేపు పట్టింది. తనకు అపజయం తప్పదని చింతాలుడు గ్రహించాడు.



అయినా వాడు పైకి ఎంతో బింకంగా, "ఇంకా పది గారెలు తింటే తప్ప, నువ్వు పందెం గెలిచినట్టు కాదు," అన్నాడు సపుష్టితో.

సపుష్టి అందుకు ఒప్పుకున్నాడు. చింతాలుడు వాడి చేత ఇరవై గారెలు తినిపించి గానీ, పది లెక్క పెట్టలేదు.

"మరి, పందెం గెలిచానని ఒప్పుకుంటావా?" అన్నాడు సపుష్టి.

"అందరూ చూశారు గదా! ఇంకా యిందులో నేను ఒప్పుకోవడానికేముంది," అన్నాడు చింతాలుడు దిగులుగా.

"ఏమీ లేదనుకో! ఈ పందెం గొడవ అయిపోతే, తీరిగ్గా కూర్చుని యింకో వంద

గారెలు తిందామనుకుంటున్నాను.'' అన్నాడు సపుష్టి.

చింతాలుడు, సపుష్టి తిండి పుష్టికి ఆశ్చర్యపోయి, ''ఇంత తినాలంటే, ఏం చేయాలో ఆ ఉపాయం కాస్త నాకు చెప్పు,'' అని అడిగాడు.

''నా ఆకలినిబట్టి, నేను తింటున్నాను. అంతే! ఇందులో ఉపాయం ఏమీ లేదు. ఉపాయం ఏమన్నా వున్నా, నేను చెప్ప లేను. ఎందువల్లనంటే, ఇంత తిండి తినే వాడికి బుర్ర పనిచెయ్యదు. బుర్ర పని చేస్తే తప్ప ఉపాయాలు తెలియవు!'' అన్నాడు సపుష్టి.

''అయితే, నువ్వు, నాకేమీ సలహా యివ్వలేవా?'' అని అడిగాడు చింతాలుడు.

''నేను, నీకివ్వగల సలహా ఒక్కటే. నీ ఆకలి తగ్గించుకునే ఉపాయం వెతుక్కో. రోజూ నీకు రెండు వందల గారెలు పెట్టే వాళ్ళుండరు,'' అన్నాడు సపుష్టి.

''బాగానే వుంది. మరి, ఆకలి ఎలా తగ్గుతుంది?'' అన్నాడు చింతాలుడు.

''సోమరికే ఆకలెక్కువ. వాడి దృష్టి ఎప్పుడూ తిండి మీదే వుంటుంది. రోజూ కష్టపడి పని చేస్తే, తిండియావ తగ్గుతుంది; తిన్నకాస్తా వంటబడుతుంది. అంతేకాదు. నిత్యం కష్టపడి, కొద్ది రోజులు పని మానేస్తే, నా ఆకలికి అంతుండడం లేదు,'' అన్నాడు సపుష్టి.

''మరి, నువ్వు కష్టపడి పని చేస్తున్నావా?'' అని ప్రశ్నించాడు చింతాలుడు.

''అవును, అలాగే నా ఆకలి తగ్గించుకుంటున్నాను. ఎవరైనా తిండి పోటీలకు పిలిస్తే, వారం రోజులు పని చెయ్యడం మానేస్తాను,'' అన్నాడు సపుష్టి.

అసరికి సోమరి జీవితంలో సుఖం లేదని చింతాలుడు గ్రహించాడు. సోమరికి ఆకలిబాధ ఎక్కువనీ, కష్టపడి పని చేసుకుంటేతప్ప జీవితం సుఖంగానూ, ఆరోగ్యంగానూ వుండదనీ వాడు తెలుసుకున్నాడు.

ఆ తర్వాత చింతాలుడు తన సోమరి పద్ధతులు మార్చుకుని, కష్టపడి పని చేయడం అలవాటు చేసుకున్నాడు.





# తెప్పకొయ్య

పడమటి తీరాన కొండ ప్రాంతంలోని బదరిగ్రామంలో ఒక పల్లెవాడు ఉండేవాడు. వాడు రోజూ తన తెప్ప మీద సముద్రంలోకి వెళ్ళి చేపలు పట్టి జీవిస్తూ ఉండేవాడు. ఇలా ఉండగా వాడి తెప్ప కాస్తా పగిలిపోయింది. ఇంకొక తెప్పకొయ్య తయారు చేసుకుందామనే ఉద్దేశంతో, మంచి దుంగను వెతుకుతూ ఒక నాటి సాయంకాలం కొండలలోకి బయలుదేరాడు.

ఎంతదూరం వెళ్ళినా తెప్పకొయ్యకు పనికివచ్చే దుంగ కనిపించనే లేదు. ఇంతలో ఆకాశాన మబ్బులు కమ్మి ఆ ప్రదేశమంతా చీకటి అయింది. అసలే తెలియని ప్రాంతం కావటంచేత వాడు ఇంటిదారి పట్టాడు.

అయితే పల్లెవాడు ఆ చీకటిలో ఎక్కడో దారి తప్పి ఉండాలి. ఎందుచేతనంటే ఎంతసేపు నడిచినా కొండలే తప్ప సముద్రం కంటపడలేదు. చుట్టూ గాఢాంధకారం; కన్ను పొడుచుకున్నా కనిపించటం లేదు. చినుకు కూడా సాగింది. ''వానకు తడుస్తూ, ఆకలికి మాడుతూ నేను తెల్లవార్లూ ఈ కొండల మీద ఉండిపోవలిసిందేనా?'' అని వాడు విచారపడుతూండగా అంతదూరాన మిణుకు మిణుకుమని దీపం కాంతి కనపడింది.

పల్లెవాడికి పోయే ప్రాణాలు తిరిగి వచ్చినట్టయింది. వాడు ఆ దీపం కనపడే దిక్కుగా చాలా దూరం నడిచి వెళ్ళి ఒక కుటీరాన్ని చేరుకున్నాడు. చాలా సేపు తలుపు తట్టినాక ఒక ముసలివాడు తలుపు తెరిచాడు.

''నేను దారి తప్పాను. ఈ రాత్రికి ఇంత తిండి పెట్టి ఇక్కడ పడుకోనిస్తావా, తాతా?'' అన్నాడు పల్లెవాడు.



"లోపలికి రా! ఇక్కడికి అయిదారు ఆమడల దూరంలో ఎక్కడా ఇల్లు లేదు." అన్నాడు ముసలాడు.

లోపల ముసలాడి భార్య ఫలహారం తయారు చేస్తున్నది. ఆమె పల్లెవాడితో ఏమీ మాట్లాడలేదు. ముసలివాడితో కూడా ఆమె ఒక్క మాట మాట్లాడలేదు. వంట పూర్తికాగానే ముగ్గురూ ఫలహారం చేసి పడుకున్నారు. పల్లెవాడు కళ్ళు మూసుకున్నప్పటికీ వాడికి నిద్ర పట్టలేదు. "ఈ ముసలివాళ్ళు ఈ నిర్జనప్రదేశంలో ఎందుకుంటున్నారు? వాళ్ళు ఒకరితో ఒకరు మాట్లాడుకోరేం? వీళ్ళ రహస్యం ఏమిటో తెలుసుకోవాలి!" అనుకున్నాడు వాడు.

అర్ధరాత్రివేళ ముసలివాడు మెల్లిగా లేచి, పిల్లిలాగా నడుస్తూ ఒక మూల వున్న పెట్టెవద్దకు వెళ్ళాడు. వాడు ఆ పెట్టెమూత ఎత్తి అందులో నుంచి ఒక నీలం రంగు కుళాయి తీయటం పల్లెవాడు చూశాడు. ముసలివాడు ఆ కుళాయి నెత్తిన పెట్టుకుని, "కాశ్మీరం! కాశ్మీరం!" అన్నాడు. వెంటనే ఇంద్రజాలం లాగా ముసలివాడు మాయమైపోయాడు. తరవాత ముసలిది లేచి పెట్టె దగ్గిరికి వెళ్ళి, అందులో నుంచి ఇంకొక నీలం కుళాయి తీసి నెత్తిన పెట్టుకుని, "కాశ్మీరం! కాశ్మీరం!" అన్నది. తరవాత ఆమె కూడా అంతర్ధానమయింది.

పల్లెవాడు ఇదంతా చూసి కొంతసేపు దిగ్భ్రమ చెందాడు. ముసలివాళ్ళిద్దరూ లేరని రూఢిచేసుకుని, వాడు కూడా లేచి పెట్టెవద్దకు వచ్చి, దాని మూత తెరిచి చూశాడు. అందులో ఇంకా రెండు మూడు నీలం రంగు కుళాయిలున్నాయి. వాటిలో ఒకటి తీసి నెత్తిన పెట్టుకుని, "కాశ్మీరం! కాశ్మీరం!" అన్నాడు వాడు.

వెంటనే వాడి కళ్ళు బరువుగా మూసుకుపోయాయి, తన మీదుగా గాలి విపరీతమైన వేగంతో వీస్తున్నట్టు అనిపించింది. ఆ గాలి హోరు ఆగిపోయాక కళ్ళు తెరిచిచూస్తే వాడు ఒక రాజభవనం



భోజనశాలలో ఉన్నాడు. ముసలి దంపతులు రాజుగారు తినగా మిగిలిన ఆహారం తిని మూటలు కట్టుకుంటున్నారు. బంగారు లోటాలూ, గిన్నెలూ వాళ్ళ మూటల్లోకి వెళ్ళిపోతున్నాయి. పల్లెవాణ్ణి చూడగానే వాళ్ళు నీలం కుళాయిలు నెత్తిన పెట్టుకుని, "బదిరి కొండలు! బదిరి కొండలు!" అంటూ మాయమైపోయారు.

వాళ్ళు వెళ్ళిపోయాక ఇక తనను అడ్డేవారు లేరనుకుని పల్లెవాడు నిర్విచారంగా తనకు కావలిసిన ఆహారమంతా తిన్నాడు. తరవాత రాజుగారి ద్రాక్షసారాయం వాడి కంటబడింది. దాన్ని తెగతాగి వాడు ఒళ్ళు తెలియకుండా అక్కడే పడిపోయాడు.

తెల్లవారుజామున రాజుగారి నౌకర్లు పల్లెవాణ్ణి భోజనశాలలో చూసి పట్టుకుని పెడరెక్కలు విరిచికట్టి రాజుగారి ఎదటికి తీసుకుపోయి, "మహారాజా, రోజూ ఎవరి కంటా బడకుండా రాజభవనంలోకి జొరబడి దొంగతనాలు చేస్తున్న గజదొంగ వీడే!" అని చెప్పారు.

"ఇంత నేర్పరి అయిన దొంగ బతికి ఉండటం మంచిది కాదు. వీణ్ణి ఒక స్తంభానికి కట్టి, చుట్టూ చితి పేర్చి అందులో వీణ్ణి సజీవంగా దహనం చేసెయ్యండి," అని రాజుగారు ఉత్తరు విచ్చాడు.

పల్లెవాణ్ణి రచ్చబండ వద్దకు తీసుకుపోయారు. అక్కడ ఒక పెద్ద దూలం పాతి వాణ్ణి, దానికి మోకులతో కట్టారు. తరవాత వాడి చుట్టూ నలుచదరంగా చితి పేర్చి దాన్ని నాలుగు మూలలా అంటించారు.

ఈ గజదొంగను చూడటానికి నగరంలోని ప్రజలు ఆబాలగోపాలమూ వచ్చారు. ఎందుకంటే రాజుగారి ఇంట రోజూ ప్రవేశించే దొంగను పట్టుకోవడానికి విశ్వ ప్రయత్నాలు జరిగాయి. రాజభవనం చుట్టూ రక్షకభటులు దడిలాగా నిలబడినప్పటికీ దొంగ ఎవరి కంటా పడకుండా లోపలికి రానూ వచ్చాడు. మళ్ళీ బయటికి

పోనూ పోయాడు! ఈ దొంగ మనిషి కాదనీ, ఏదో భూతమనీ కూడా ప్రజలు అనుకునేవారు. అందుచేత పట్టుపడ్డాడన గానే ప్రజలు దొంగను చూడవచ్చారు.

మంటలు దగ్గిరికి వస్తున్నాయి. పల్లెవాడు తనకు ఆయువు చెల్లిపోయిందనే అనుకున్నాడు. ఇంతలో వాడికి నీలం కుళాయి జ్ఞాపకం వచ్చింది. వాడు న్యాయాధికారి కేసి తిరిగి, "బాబూ, ఒక్క తుది కోరిక. నా నీలం కుళాయి నా నెత్తిన పెట్టించండి. అది అంటే నా కెంతో ప్రాణం! దాన్ని కూడా నాతో పాటు కాలి బూడిద కానివ్వండి!" అన్నాడు.

ఈ కోరిక న్యాయాధికారికి సబబుగానే కనిపించింది. ఆయన ఆజ్ఞాపించిన మీదట ఒక భటుడు చితి ఎక్కి వెళ్ళి నీలం కుళాయిని పల్లెవాడి నెత్తిన పెట్టాడు. పల్లెవాడు వెంటనే, "బదిరి కొండలు! బదిరి కొండలు!" అంటూ అదృశ్యమైనాడు. వాడితో బాటు వాణ్ణి కట్టిన దూలమూ, కట్టుతాళ్ళూ కూడా మాయమయాయి. ఈ గజదొంగ మనిషి కాదని ప్రజలు రూఢిచేసుకున్నారు.

పల్లెవాడు బదిరి కొండలు చేరుకున్నాడు. తన కట్లు విప్పటానికి ఎవరైనా దొరుకుతారేమో అని, వాడు మెల్లగా తల ఎత్తి చూస్తే ఎదురుగా వస్తూ ఒక మనిషి కనిపించాడు.

"బాబ్బాబూ! నీకు పుణ్యం ఉంటుంది. ఈ కట్లు కాస్త విప్పు!" అన్నాడు వాడు ఆ మనిషితో.

"నువు ఈ చోటుగాని చోట ఈ దూలాని కెట్టా కట్టుబడ్డావు? ఇదేదో మంచి దేవదారు దూలంలాగుందే!" అన్నాడు ఆ మనిషి కట్లు విప్పుతూ.

"అవునవును. నాకు తెప్ప కొయ్య కావలిసి దీన్ని తెచ్చుకున్నాలే. కాశ్మీరు మహారాజుగారు స్వయంగా దీన్ని నాకు బహుమతి చేశారు!" అంటూ పల్లెవాడు ఆ దూలాన్ని భుజానికెత్తుకుని ఇంటిదారి పట్టాడు.



# మాటకారితనం

పనిమీద పట్నం వెళ్ళిన రాజయ్యా అనే రైతు, పని ముగించుకుని వస్తూ, ఒక దుకాణం ముందు ఆగాడు. అది శాలువాలమ్మే దుకాణం. దాని యజమాని అతణ్ణి లోపలికి ఆహ్వానించి ఒక శాలువా చూపిస్తూ, "మీరు కొనడం, కొనకపోవడం వేరే సంగతి. ఇది చాలా అపురూపమైన శాలువా, అయినా ధర చాలా తక్కువ. దీన్ని కప్పుకుని బయలుదేరారంటే, మిమ్మల్ని సాక్షాత్తూ, ఈ ఊరి జమీందారే అనుకుంటారు. ఒకసారి కప్పుకుని, అలా వీధిలోకి వెళ్ళి రండి!" అంటూ శాలువాను రాజయ్యా భుజాల మీద కప్పాడు.

రాజయ్యా మొహమాటపడి, ఆ శాలువాతో వీధి అటు నుంచి యిటు తిరిగి, దుకాణంలోకి వస్తూండగా, దాని యజమాని, "ఆహా, ఎంతో అపురూపమైన శాలువా కప్పుకున్న మీరు తప్పక యీ ఊరి జమీందారుగారే అయి వుంటారు! మహాభాగ్యం, ఏమి సెలవు?". అన్నాడు రాజయ్యాను గుర్తుపట్టనట్లే.

దుకాణదారు మాటకారితనం చూసి ముచ్చటపడి, రాజయ్యా ఆ శాలువా కొన్నాడు.

—సి. ఎస్. ఎ. షరీఫ్






# దోసకాయల బేరం

పూర్వం ఒక సుల్తా నుండేవాడు. ఆయన ఒకనాడు వేటకు బయలుదేరి పోతూ ఉండగా, దారిలో అడవి మధ్య ఆయనకు ఒక రైతు కనిపించాడు. ఆ రైతు ఒక గాడిదను తోలుకుంటూ వస్తున్నాడు. దాని మీద ఏదో మూట వున్నది.

సుల్తాను తన గుర్రాన్ని ఆపి రైతును పలకరించి, ''తమ్ముడూ, ఆ మూటలోవి ఏమిటి?'' అని అడిగాడు.

''బాబూ, ఇవి దోసకాయలు. నా తోటలో కాసిన తొలికాపు. తరుణానికి ముందే కాశాయి. అందుకని వీటిని తీసుకు పోయి సుల్తానుగారికి అమ్ముకుందామని బయలుదేరాను. ఆయన గొప్ప దాత అని చెబుతారు. మంచి ధర ఇస్తారని ఆశగా వుంది.'' అన్నాడు రైతు. వాడు సుల్తానును పూర్వం ఎన్నడూ చూసివుండని కారణం చేత గుర్తించ లేకపోయాడు.

''సుల్తానుగారు నీ దోసకాయలకు ఏపాటి ఇస్తారనుకుంటున్నావు?'' అని సుల్తాను రైతును అడిగాడు.

''కనీసం వెయ్యి బంగారు దీనారాలన్నా ఇవ్వకపోతారా?'' అన్నాడు రైతు.

''అది చాలా జాస్తి అని సుల్తాను అంటే ఏం చేస్తావు?'' అని సుల్తాను అడిగాడు.

''పోనీ అయిదు వందలే ఇయ్యమంటాను!'' అన్నాడు రైతు.

''అదీ ఎక్కువేనంటే?''

''మూడు వందలియ్యమంటాను.''

''అదీ ఎక్కువేనంటే?''

''రెండు వందలియ్యమంటాను.''

''అదీ ఎక్కువేనంటే?''

''వంద ఇయ్యమంటాను.''

''అదీ ఎక్కువేనంటే?''

''యాభై అడుగుతాను.''

అరేబియా కథ

''అదీ ఎక్కువేనంటే ?''

''ముష్టి అడుగుతాను.''

''అదీ ఎక్కువేనంటే ?''

''నా గాడిదను ఆయన సింహాసనం మీదికి తోలి, పారిపోతాను,'' అన్నాడు రైతు.

సుల్తాను విరగబడి నవ్వి రైతును వెళ్లి పోనిచ్చాడు. తరవాత ఆయన వేట మానేసి ఇంకొక దారిన ఇంటికి తిరిగి వచ్చేశాడు. వస్తూనే ఆయన ద్వారపాలకులతో, ''నా కోసం ఒక రైతు గాడిదతో సహా ఇక్కడికి వస్తాడు. వాణ్ణి ఆపకుండా నా వద్దకు రానివ్వండి!'' అని చెప్పాడు.

ఒక గంటకల్లా రైతు గాడిదను తోలుకుంటూ ద్వారం వద్దకు వచ్చి సుల్తానుగారి దర్శనం కావాలని కోరాడు. ద్వారపాలకులు వాణ్ణీ, గాడిదనూ లోపలికి పోనిచ్చారు.

దుస్తులు మార్చుకుని తన కోసం ఆవరణలో వేచివున్న సుల్తానును చూసి రైతు గుర్తించలేదు. వాడు దోసకాయల మూటను చేతపట్టుకుని సుల్తాను ముందు ఎంతో విధేయతగా నిలబడ్డాడు.

''నా కోసం ఏదో తెచ్చినట్టున్నావే? ఏమిటోయ్ అవీ?'' అని అడిగాడు సుల్తాను.

''ఏలినవారు అనుగ్రహిస్తే, నా తోటలో కాసిన తొలికాపు దోసకాయలు ఇచ్చుకుందామని తెచ్చాను,'' అన్నాడు రైతు ఉత్సాహంగా.



''భేష్! నా అనుగ్రహం ఎంతదాకా ఉండాలని నీ ఉద్దేశం?'' అన్నాడు సుల్తాను బిగ్గరగా నవ్వుతూ.

''వెయ్యి దీనారాలు,'' అన్నాడు రైతు.

''అది ఎక్కువ,'' అన్నాడు సుల్తాను.

''అయిదు వందలు.''

''అదీ ఎక్కువే.''

''మూడు వందలు.''

''అదీ ఎక్కువే.''

''ఒక వంద.''

''అదీ ఎక్కువే.''

''యాభై.''

''అదీ ఎక్కువే.''

''ముప్పై.''

''అదీ ఎక్కువే.''

''ఆ పాపిష్ఠి మొహంవాడు దారిలో కనిపించటం నాకు చేటయింది! ముప్పై దీనారాలన్నా ఇవ్వందే నేను దోసకాయ లిచ్చేది లేదు!'' అన్నాడు రైతు.

సుల్తాను నవ్వాడేగాని జవాబు చెప్ప లేదు. ఇది గమనించి రైతు ఒక అడుగు ముందుకు వచ్చి సుల్తాను ముఖాన్ని మరి కాస్త పరీక్షగా చూసి, తనకు దారిలో గుర్రం మీద కనిపించిన మనిషి సుల్తానే అని తెలుసుకున్నాడు.

''హుజూర్, దయచేసి నాకు ముప్పై దీనారాలు వెంటనే ఇప్పించండి. లేక పోతే—నా గాడిద బయటనే కట్టేసి ఉంది!'' అన్నాడు రైతు.

సుల్తాను నవ్వు పట్టలేక బాలీసుపైన వెల్లికిలా పడిపోయాడు. తరవాత ఆయన తన ఖజానాదారును పిలిచి, ''ఈ రైతుకు వెయ్యి దీనారాలు ఎంచి ఇయ్యి, తరవాత మరో అయిదు వంద లియ్యి; ఆ తరవాత మూడు వందలూ, వందా, యాభై, ముప్పై దీనారాలు వరసగా ఎంచి ఇయ్యి!'' అన్నాడు.

ఒక్క బస్తా దోసకాయలకు పందొమ్మిది వందల యెనభై దీనారాలు ముట్టేసరికి ఆ రైతుకు నోటమాట రాలేదు. వాడు పట్టలేని ఆనందంతో సుల్తానుకు వెయ్యి సలాములు చేసి వెళ్ళిపోయాడు.





# శివపురాణం

పార్వతి సలహా ప్రకారం లక్ష్మిగణాధిపతి విష్ణువు వద్దకు వెళ్ళి, తనకు జరిగిన అన్యాయం చెప్పుకుని, "నేను కుమారస్వామితో పోటీపడి భూప్రదక్షిణం చెయ్యగలనా? కుమారస్వామి అప్పుడే బయలుదేరి వెళ్ళిపోయాడు," అన్నాడు.

విష్ణువు అతనితో, "బాబూ, విచారించకు. శివపంచాక్షరీ మంత్రం ఐదు లక్షలు జపించి, పార్వతీ పరమేశ్వరుల చుట్టూ మూడుసార్లు తిరిగావంటే నీకు భూప్రదక్షిణ చేసిన ఫలితమూ, తీర్థయాత్రల ఫలితమూ దక్కుతుంది," అన్నాడు.

లక్ష్మిగణపతి అలాగే శుచి అయి, ఒక చోట దర్భాసనం మీద కూర్చుని శివపంచాక్షరి జపించసాగాడు.

ఈలోపల కుమారస్వామి నెమలి వాహనం మీద మొదటి తీర్థాన్ని చేరుకోబోతుండగా అక్కడ లక్ష్మిగణపతి అప్పుడే స్నానం చేసి, తీర్థం నుంచి వెళ్ళిపోతున్నట్టు దూరం నుంచి కనిపించింది. కుమారస్వామి దగ్గిరికి వచ్చి చూసేసరికి, ఇసుకలో స్పష్టంగా ఎలుక పాదాల గుర్తులు కనిపించాయి.

కుమారస్వామి ఆ తీర్థంలో ఉండే వారిని, "అయ్యా, ఇక్కడికి పెద్ద పొట్ట గల పొట్టి వాడొకడు ఎలుక నెక్కి వచ్చి స్నానం చేసి వెళ్ళాడా?" అని అడిగాడు.

"అవును, బాబూ, ఇప్పుడే వెళ్ళాడు. అదుగో దూరాన ఇంకా కనిపిస్తూనే ఉన్నాడు. మహా పుణ్యాత్ముడు. మా




కందరికీ తలా ఒక సువర్ణమూ దానం చేశాడు!'' అన్నారు వాళ్ళు.

''ఆహా! పొట్టివాడు ఎంతపని చేశాడూ! ఇక్కడ స్నానం చేస్తూ కాలయాపన చెయ్యరాదు, ముందు వచ్చే తీర్థంలో స్నానం చేస్తాను,'' అనుకుని కుమారస్వామి ముందున్న క్షేత్రానికి వెళ్ళాడు. కాని అతను అక్కడికి చేరేసరికి లక్ష్మీగణపతి అప్పుడే ఆ తీర్థంలో స్నానం చేసి వెళ్ళి నట్టు స్పష్టమయింది!

ఎక్కడికి వెళ్ళినా కుమారస్వామికి ఇదే అనుభవం అయింది. అతను ఏ తీర్థమూ సేవించకుండానే భూప్రదక్షిణం చేసి కైలాసానికి తిరిగి వచ్చాడు. ఈ లోపలనే లక్ష్మీగణపతి శివపంచాక్షరి అయిదులక్షలసార్లు జపించి, పార్వతీ పరమేశ్వరుల చుట్టూ మూడుసార్లు ప్రదక్షిణం చేసి, వారి ముందు వినయంగా చేతులు జోడించి నిలబడ్డాడు.

సభలో వాళ్ళందరూ గుసగుసలాడుకుని, ''ఈ లక్ష్మీగణపతి భూప్రదక్షిణం చెయ్యకుండానే గణాధిపత్యం సంపాదిస్తాననుకుంటున్నాడు!'' అనుకున్నారు.

ఇంతలో కుమారస్వామి తిరిగి వచ్చి, పార్వతీ పరమేశ్వరులతో, ''నేను గణాధిపత్యానికి తగను. లక్ష్మీగణపతికే గణాధిపత్యం ఇవ్వండి,'' అన్నాడు.

శివుడి సభలో ఉన్నవారూ, పార్వతీ పరమేశ్వరులూ కూడా ఆశ్చర్యపడి, ''ఎందుకు అలా అంటున్నావు?'' అని కుమారస్వామిని అడిగారు.

''నేను ప్రపంచంలో ఉన్న అన్ని క్షేత్రాలకూ వెళ్ళాను. కాని ఏ తీర్థంలోనూ స్నానం చెయ్యలేదు. ఎందుకంటే, ప్రతి తీర్థంలోనూ ఈ లక్ష్మీగణపతి నాకన్న ముందే స్నానం చేసి వెళ్ళిపోవటం నాకు కనిపించింది. తీర్థాలలో వాళ్ళు కూడా నాకు ఆ మాటే చెప్పారు. అతను నాకన్న మహా శక్తిగలవాడు. రుద్రగణాలకు నాయకుడుగా ఉండటానికి అతనే తగిన వాడు,'' అన్నాడు కుమారస్వామి.



సభలో వారందరూ శివపంచాక్షరీ ప్రభావాన్ని గ్రహించి, లక్ష్మిగణపతినే రుద్రగణాలకు అధిపతిగా చెయ్యటానికి ఒప్పుకున్నారు. అతన్ని గణాధిపతిగా అభిషేకించే ప్రయత్నాలు ఆరంభమయాయి.

రుద్రగణాలవాళ్ళు వెళ్ళి పుణ్యనదీ జలాలూ, సప్తసముద్రజలాలూ తెచ్చారు. ప్రమధ, భూతగణాలనూ, గరుడ, గంధర్వ, కిన్నర, కింపురుష, నాగ, భూలోకవాసులనూ పిలిపించారు. బృహస్పతి పెట్టిన ముహూర్తాన లక్ష్మిగణపతినీ, అతని భార్య అయిన జయలక్ష్మినీ నవరత్నసింహాసనం మీద కూర్చోబెట్టి, సమస్త గణాల మీదా అతనికి ఆధిపత్యం ఇస్తూ, తన తమ్ములైన ఇతర గణపతులందరిపైనా అధికారం ఇచ్చారు. అతనికి పార్వతీ పరమేశ్వరులు అభిషేకం చేశారు. తరవాత వాళ్ళు లక్ష్మిగణపతితో, ''నువ్వూ, నీ తమ్ములూ మూడు లోకాలనూ పాలిస్తూ మిమ్మల్ని తలచినవారికీ, పూజించినవారికీ, మిమ్మల్ని గురించి తపస్సు చేసినవారికీ సహాయపడుతూ, వారి కార్యాలు సఫలం అయేటట్టు చూడండి,'' అన్నారు.

ఇది ఇలా ఉండగా తారకాసురుడు చనిపోయిన అనంతరం అతని భార్య, తన కుమారులైన తారకాక్షుడూ, కమలాక్షుడూ, విద్యున్మాలీ అనే ముగ్గురినీ వెంటబెట్టుకుని రసాతలానికి పారిపోయి, అక్కడ వాళ్ళకు శుక్రాచార్యుడి చేత సకల విద్యలూ చెప్పిస్తూ, పెంచి పెద్దవాళ్ళను చేసింది.

ఆ కుర్రవాళ్ళు పెద్దవాళ్ళయాక తమ తండ్రి ఎలా చచ్చిపోయినదీ తెలుసుకున్నారు. అప్పుడు వాళ్ళు మేరుపర్వతం మీదికి పోయి, బ్రహ్మను గురించి దీర్ఘమైన తపస్సు చేశారు.

బ్రహ్మ తారకుడి కొడుకుల తపస్సుకు మెచ్చి, ప్రత్యక్షమై, ''మీకు ఏమి వరాలు కావాలి?'' అని అడిగాడు.

"దేవా, రథం కాని రథం మీద, విల్లు కాని విల్లుకు, బాణం కాని బాణం సంధించి కొడితే తప్ప మాకు చావు లేకుండా అనుగ్రహించు. మాకు సకల విద్యలూ, తేజోబలాలూ, ఐశ్వర్య త్యాగ భోగభాగ్యాలూ, శివభక్తీ, బంగారమూ, వెండీ, ఇనుములతో చేసిన పురాలు నివసించటానికి కావాలి," అన్నారు ఆ ముగ్గురూ.

బ్రహ్మ వారు కోరిన వరాలిచ్చి, వారికి కావలసిన పురాలను నిర్మించిపెట్టే పని విశ్వకర్మకు అప్పగించి, అదృశ్యుడయాడు.



విశ్వకర్మ బంగారంతోనూ, వెండితోనూ, ఇనుముతోనూ, మూడు పురాలు నిర్మించి తారకుడి కొడుకులకు ఇచ్చాడు. అవే త్రిపురాలు. వాటికి కామగమనం ఉండేది. అవి ఆకాశంలో నిలిచి ఉండేవి. వాటిలో ఇళ్ళూ, చెట్లూ, చెరువులూ, ధన ధాన్య సమృద్ధీ ఉండేవి. బంగారంతో చేసిన పురంలో తారకాక్షుడూ, వెండి దానిలో కమలాక్షుడూ, ఇనుపదానిలో విద్యున్మాలీ నివాసాలు ఏర్పరచుకుని, వాటితో మూడు లోకాలూ స్వేచ్ఛగా తిరగసాగారు.

ఈ త్రిపురాలను జయించటం ఇంద్రుడు మొదలుగా గల దేవతలకు ఏమాత్రం సాధ్యం కాలేదు. వాళ్ళు బ్రహ్మ వద్దకు వెళ్ళి, "త్రిపురాసురులు మమ్మల్ని చాలా బాధ పెట్టుతున్నారు. వాళ్ళ నగరాలు మా ఇళ్ళ మీద వాలి, వాటిని నేలమట్టం చేస్తున్నాయి," అని మొరపెట్టుకున్నారు.

"త్రిపురాసురులు తేలికగా చావరు. మనం శివుడి సలహా అడుగుదాం," అని బ్రహ్మ దేవతలను వెంటబెట్టుకుని శివుడి వద్దకు వెళ్ళాడు.

శివుడు వారు వచ్చిన పని తెలిసి, "త్రిపురాసురులను నేను చంపను. కావలిస్తే నా తేజస్సు సగం యిస్తాను, మీరే వాళ్ళను చంపండి," అన్నాడు.

త్రిపురాసురులకు తాను ఇచ్చిన వరాలు చెప్పి బ్రహ్మ, ''మా తేజస్సు కూడా తీసుకుని నువే వారిని చంపాలి,'' అన్నాడు.

రథం కాని రథమూ, విల్లు కాని విల్లూ, బాణం కాని బాణమూ కావలిసి ఉన్నది. అందుచేత శివుడు భూమిని రథంగానూ, వేదాలను రథాశ్వాలుగానూ, సూర్యచంద్రులను రథ చక్రాలుగానూ, మేరువును విల్లుగానూ, ఆదిశేషుణ్ణి వింటి తాడుగానూ చేసుకుని, విష్ణుమూర్తిని నారాయణాస్త్రంగా ఉపయోగించి, త్రిపురాలను కొట్టాడు. ఆ మూడు పురాలూ బూడిద అయి భూమి మీద రాలిపోయాయి.

త్రిపురాసురులు నాశనం కాగా జలంధరు డనే మరొక రాక్షసుడు బయలుదేరి లోకాలను పీడించసాగాడు. జలంధరుడి అసలు పేరు సూకరుడు. అతను హిరణ్యకశిపుడి పదవ కొడుకైన అగ్నిజిహ్వుడి కుమారుడు; బ్రహ్మను గురించి అతి ఘోరమైన తపస్సు చేసి, దేవగణాల చేతగాని, రాక్షస గణాల చేతగాని, నాగులూ, మానవులూ మొదలైన వారిచేత గాని చావు లేకుండానూ, నీటి లోపల నివసించే లాగూనూ వరాలు పొంది, అష్టదిక్కులూ గెలిచి, దేవేంద్రుడు మొదలైనవారిని స్వర్గం నుంచి పారదోలి, స్వర్గాన్ని ఆక్రమించుకుని మూడు లోకాలూ పాలించసాగాడు.

జలంధరుడికి ఓడి, కైలాసం నుంచి శివుడూ, వైకుంఠం నుంచి విష్ణువూ పారిపోయి, ఇద్దరూ మానససరస్సులో దాక్కున్నారు. అక్కడ వాళ్ళిద్దరూ కూడబలుక్కుని, పరబ్రహ్మను గురించి తపస్సు చేయగా పరబ్రహ్మ స్వరూపుడు ప్రత్యక్షమై, విష్ణువుకు చక్రమూ, శివుడికి త్రిశూలమూ ఇచ్చి, ''మీరు ఒకరి ఆయుధాలు మరొకరు పుచ్చుకుని జలంధరుణ్ణి చంపండి,'' అని హెచ్చరించి అదృశ్యుడయిపోయాడు.

శివ విష్ణువులు సంతోషించి, తమ ఆయుధాలు మార్చుకుని, జలంధరుడి కోసం చూడసాగారు.





# ఆకతాయి పిశాచాలు

పది రోజులపాటు పట్నంలో ఉద్యోగ ప్రయత్నాలు చేసి, ఇంటికి తిరిగి వచ్చిన అవతారంతో వాడి అవ్వ, ''ఏం, నాయనా! నా ఆరోగ్యం సరిలేదు. నేను ఎలానూ వెళ్ళలేను. రేపు తెల్లవారుజామునే, మీ మేనమామ కూతురు ఆదిలక్ష్మి పెళ్ళి. ఆ సంగతి మరిచావా ?'' అన్నది.

అవ్వ మాటలు వింటూనే అవతారం ఉలిక్కిపడ్డాడు. ఆదిలక్ష్మి అతడికంటె వయసులో ఒకటి, రెండేళ్ళు పెద్ద. చిన్నప్పుడు కలిసి ఆడుకున్నారు. ఆమె పెళ్ళి రోజు తను మరిచిపోవడం ఏమిటి!

''అవ్వా, నువ్వు గుర్తు చెయ్యకపోతే ఎంత పొరబాటు జరిగేది. మామయ్య వాళ్ళ యింటికి యిప్పుడే బయలుదేరు తాను,'' అన్నాడు అవతారం.

''ఇప్పుడా ? ఇంత రాత్రి వేళా !'' అన్నది అవతారం అవ్వ ఆదుర్దాగా.

''చూడు, పేరుకు రాత్రేగాని, పుచ్చ పువ్వు లాంటి వెన్నెల. అలా కాలవగట్టు పట్టుకున్నానంటే, రెండు గంటల్లో మామయ్య ఇంట్లో వుంటాను,'' అంటూ అవతారం బయలుదేరాడు.

వాడు కాలవగట్టు మీద చకచకా నడుస్తూ, త్వరలోనే మేనమామ ఊరును సమీపించాడు. అక్కడ అవతారం కాలవ గట్టు దిగి, ఒక తాటితోపులో వున్న కాలి బాట వెంట ఊరు చేరాలి.

అవతారం తాటితోపులో ప్రవేశించి కొద్ది దూరం నడిచాడో లేదో, హఠాత్తుగా ఒక చెట్టు వెనక నుంచి రెండు ఆడ పిశాచాలు ముందుకు వచ్చి, వాడి దారిని అడ్డగించాయి.

అవతారం నిలువెల్లా వణికిపోసాగాడు. అప్పుడు పిశాచాల్లో ఒకటి, ''నీ అవతారం చూస్తే, ఎవరైనా ధైర్యవంతుడి వనుకుం

మాచిరాజు కామేశ్వరరావు



టారు! ఎందుకలా బాణం దెబ్బతిన్న కొంగలా రెపరెపలాడి పోతావు. ఎక్కడికి, నీ ప్రయాణం?'' అని అడిగింది.

''ఆదిలక్ష్మి పెళ్ళికి.'' అన్నాడు అవతారం యింకా వణుకుతూనే.

ఆ మాట వింటూనే పిశాచాలు ముఖముఖాలు చూసుకుని, కేరింతలు కొడుతూ, ''చూడూ, ఆదిలక్ష్మి పెళ్ళో, అనంతలక్ష్మి పెళ్ళో—ఏదైనా మాకొకటే. మేమూ వస్తాం.'' అన్నవి.

అప్పటికి అవతారం కాస్త స్థిమితపడి, ''సంగతి తెలిశాక, మామయ్యా, నా చర్మం వలిచేస్తాడు. పెళ్ళికి పిశాచాలను వెంట పెట్టుకుపోవడమా!'' అన్నాడు.

''వెంటబెట్టుకు పోకపోతే, యిప్పుడే చర్మం వలిచేస్తాం. మరేమంటావిప్పుడు?'' అని అడిగినై పిశాచాలు.

ఇక తప్పదనుకుని అవతారం, "ఇప్పుడే మీ చేత చర్మం వలిపించుకునేకంటే, తప్పనిసరైతే, ఆదిలక్ష్మి పెళ్ళి చూశాక మామయ్యే చేత ఆ పని చేయించుకుంటాను. మీరు కాస్త గుట్టుమట్టుగా, నా వెంట రాలేరా?'' అని అడిగాడు పిశాచాలను.

''అదంతా మాకొదులు, ముందు నువ్వు కదులు!'' అన్నవి పిశాచాలు తృప్తిగా.

అవతారం నడకసాగించాడు. పిశాచాలు మరి కనిపించలేదు. అయితే, వాడు మేనమామ ఇంటిని సమీపిస్తూండగా పిశాచాలు రెండూ ముందే పెళ్ళి పందిరిని సమీపించి, మెడనిండు నగలతో, పట్టు చీరలతో ఇంట ప్రవేశించినై.

ఇది చూసి అవతారం భయంతో వణికిపోతూ, పెళ్ళిపందిరి దాటి వాకిట్లోకి రాగానే, అక్కడ వాడి మేనమామ ఎదురుపడి, "ఏమిటలా గజగజలాడిపోతున్నావు? నేను పెళ్ళిపనుల హడావిడిలో వున్నాను. పోయి కాస్సేపు, ఆ పక్కగదిలో నడుం వాల్చు. తరవాత వైద్యుణ్ణి పిలిపిస్తాను,'' అంటూ వెళ్ళిపోయాడు.

అవతారం గదిలోకి పోయి, ఒక మూలగా చాప మీద ముణగడ తీసుకుని

పడుకున్నాడు. ఈ లోపల పిశాచాలు రెండూ తమ ఇష్టానుసారం అల్లరిపనులు ప్రారంభించినై.

ఆడపెళ్ళివారు, మగపెళ్ళివారికి ఎదురుగా వున్న మండువా ఇంటిని విడిదిగా యిచ్చారు.

పిశాచాల్లో ఒకటి పెళ్ళికొడుకు తల్లిగా రూపం మార్చుకుని, పెళ్ళికూతురు వున్న గదిలోకి వెళ్ళింది.

కాబోయే వియ్యపురాలిని చూసి ఆదిలక్ష్మి తల్లి, ''రా, వదినా, రా!'' అంటూ ఆహ్వానించింది.

''నువ్వు యివ్వబోయే సారె ఏపాటి ఘనంగా వున్నదో చూడాలని వచ్చాను, వదినా!'' అన్నది పిశాచం.

ఆ పక్కనే తాటాకుబుట్టల్లో వున్న లడ్లు, సున్ని ఉండలు, చలిమిడి, అరిశెలు—అన్నీ ఆదిలక్ష్మి తల్లి పిశాచానికి చూపించింది:

పిశాచం చలిమిడి కొద్దిగా తీసుకుని నోట్లో వేసుకుని, ''ఈ దిక్కుమాలిన చలిమిడి, మీ అమ్మాయి రంగులాగే వున్నది. మరీ పాతబెల్లంతో గాని చేయించావేమిటి?'' అన్నది.

ఆ ప్రశ్నకు ఆదిలక్ష్మికీ, ఆమె తల్లికీ మనస్సు చివుక్కుమన్నది.

తరవాత పిశాచం అరిశెలకూ, సున్ని ఉండలకూ కూడా బావోలేదంటూ పేర్లు పెట్టి, ''మరి రెండు బుట్టల్లో బూరెలూ, పులిహోరా సర్దించు,'' అన్నది.





ఆమె తల్లి హడావిడిపడుతూ కూతురి వెనకగా పెరట్లోకి వెళ్ళగానే, పిశాచం రూపం మార్చుకుని గదిలోంచి వెళ్ళిపోయింది.

ఆదిలక్ష్మి చన్నీళ్ళతో ముఖం కడుక్కుని, "నా కంఠంలో ప్రాణం వుండగా, యీ పెళ్ళి చేసుకోను!" అన్నది తల్లితో.

ఆ మాటలకు ఆమె తల్లి కంగారుపడిపోయి, భర్తను వెతికేందుకు వీధికేసి పరిగెత్తింది.

ఇక రెండో పిశాచం పెళ్ళికొడుకువాళ్ల విడిది ఇంట్లోకి వెళ్ళింది. పనంతా ఆడపెళ్ళివారిదే కావడంతో, మగపెళ్ళివారంతా కునికిపాట్లు పడుతున్నారు. పెళ్లికొడుకు ఒక్కడూ మిద్దె మీద పడుకుని దోమల బాధతో సతమత మవుతున్నాడు.

పిశాచం పెళ్ళికూతురిలా రూపం మార్చుకుని, ఒక విసనకర్రతో అతడి దగ్గిరకు వెళ్ళింది.

పెళ్ళికొడుకు ఆశ్చర్యపడుతూ, "ఇలా వచ్చావేమిటి? ఎవరైనా చూస్తే నవ్వరూ!" అన్నాడు.

"ఆ మాత్రం నేనూ నవ్వగలను. ఇక్కడ నువ్వు దోమలబాధ భరించలేకుండా వున్నావని వచ్చాను. మా ఊరి దోమలు కందిరీగల్నె వెన్నంటి తరమగలవు. వెధవదోమలు!" అంటూ పిశాచం

ఆదిలక్ష్మి తల్లి నిర్ఘాంతపోయి, "వాటికి అంత తొందరేం, వదినా! అవి మర్నాటికే పులుపెక్కిపోతాయిగదా," అన్నది.

"మా ఇంటి కోడళ్ళు, అలా పులుపెక్కినవీ, పాచిపోయినవీ తినడం ఆనవాయితీ. ఈ లడ్డు పులుపుకంపు కొట్టడానికి, పది రోజులు పడుతుంది. అప్పటి దాకా బూరెలూ, పులిహోరా తింటుంది, మీ అమ్మాయి," అన్నది పిశాచం.

గౌరీపూజకు సిద్ధమవుతున్న ఆదిలక్ష్మికి, ఆ మాటలు వినగానే, పెద్ద గరిటెతో కడుపులో దేవినట్టయింది. ఆమె చప్పున పెరట్లోకి పరిగెత్తి భళ్ళున వాంతి చేసుకున్నది.



విసనకర్ర కాడతో పెళ్ళికొడుకు చేతి మీద బలంగా కొట్టింది.

పెళ్ళికొడుకు అబ్బా అని వూరుకున్నాడు.

అయినా, పిశాచం అతణ్ణి వదలక, ఇక్కడొక దోమా, అక్కడొక దోమా, అంటూ విసనకర్రతో ఎడాపెడా కొట్టసాగింది.

దానితో సహనం కోల్పోయిన పెళ్ళికొడుకు, "ఇక చాల్లే ఊరుకో!" అంటూ పిశాచం చేతిలోని విసనకర్రను లాక్కున్నాడు.

పిశాచం కళ్ళనీళ్ళు తుడుచుకుంటున్నట్టు నటిస్తూ, "దోమలను కొడుతూంటే తగిలిన చిన్న దెబ్బలకే, యింత కోపం తెచ్చుకున్నావు. రేపు పెళ్ళయాక, నిజంగానే కొడితే మరెంత కోపం తెచ్చుకుంటావో!" అన్నది.

"ఏమిటి! పెళ్ళయాక నన్ను కొడతావా?" అన్నాడు పెళ్ళికొడుకు నివ్వెరపోతూ.

"నీ వంట నచ్చకపోతే, మరి కొట్టక ఏం చేస్తాను!" అన్నది పిశాచం.

"నేను వంట చేయాలా?" అన్నాడు పెళ్ళికొడుకు కోపంగా.

"గిన్నెలు కడిగి ఊరుకుందామనుకుంటున్నావా? అదేం కుదరదు. ఇంటి ముందు కళ్ళాపిచల్లడం, బట్టలు ఉతకడం—ఇంకా చిల్లరమల్లరపనులు చాలా చేయవలసి వుంటుంది." అన్నది పిశాచం.

పెళ్ళికొడుకు లేచి నిలబడి, "నీకాక్కావలసింది భర్త కాదు; పాలేరు!" అంటూ పరుగు, పరుగున మిద్దె దిగి తల్లిదండ్రుల దగ్గిరకు పోయి, జరిగినదంతా చెప్పి, "నేను ఛస్తే, ఆ పిశాచిని చేసుకోను!" అన్నాడు.

క్షణాల మీద పెళ్ళికూతురూ, పెళ్ళికొడుకూ కూడా యీ పెళ్ళికి ఒప్పుకోవడం లేదనే సంగతి నలుగురికీ తెలిసిపోయింది. అటూ యిటూ వచ్చిన బంధువులు, "ఇదేమైనా బొమ్మలాటఅనుకుంటున్నారా!

ఎందుకు చేసుకోరో చెప్పండి ?'' అని రెండు పక్షాలవాళ్ళనూ నిలదీసి అడిగారు.

''పెళ్ళికొడుకు తల్లి పరమగయ్యాళి. ఇంతకు కొంచెం సేపు ముందు వచ్చి, నానా మాటలూ అన్నది,'' అన్నారు ఆడ పెళ్ళివారు.

''భోజనాలు చేశాక, ఆడపెళ్ళివారింటికి నేనెప్పుడు వెళ్ళాను !'' అంటూ పెళ్లి కొడుకు తల్లి నిర్ఘాంతపోయింది.

''పెళ్ళికూతురు లంఖిణి ! పెళ్లయాక మొగుడిచేత అడ్డమైన చాకిరీ చేయిస్తానని యిప్పుడే చెప్పి వెళ్ళింది,'' అన్నారు మగపెళ్ళివారు.

ఆ మాటలకు ఆదిలక్ష్మి ఆశ్చర్యపోయింది. ఆడా, మగా పెళ్ళివాళ్ళకు ఒకరు చెప్పేది ఒకరికి అర్థం కాక గొడవ పడసాగారు. పిశాచాలు తాము ఆడిన నాటకం బాగా రక్తికట్టిందంటూ నవ్వుకోసాగాయి. ఇలా కొంతసేపు జరిగాక విసిగిపోయిన ఆదిలక్ష్మి తండ్రికి, అవతారం గుర్తుకువచ్చాడు.

ఆయన అవతారం వున్న గదిలోకి వచ్చి, వాడి ఒళ్ళంతా ముచ్చెమటలు పోసి వుండడం గమనించి, ''ఎవరైనా వెళ్ళి ఆంజనేయుల్ని తీసుకురండి !'' అంటూ పెద్దగా కేకపెట్టాడు.

ఆంజనేయులు ఆ ఊళ్ళో పేరు మోసిన వైద్యుడు !

ఆంజనేయులు అన్న మాట వింటూనే, మెడబరువు నగలతో, పట్టుచీరలతో ధగ ధగ మెరిసిపోతున్న పిశాచాలు రెండూ కెవ్వుమని అరిచి, నల్లపిల్లులుగా మారి చీకట్లోకి పారిపోయినై. అది చూసి పెళ్ళివారిలో కొందరు ఆశ్చర్యపోయారు, మరి కొందరు పొట్టలు చెక్కలయ్యేలా నవ్వుకున్నారు.

తరవాత అవతారం ద్వారా అందరికీ జరిగినదేమిటో తెలిసింది. ఇంత గొడవకూ, ఆకతాయి పిశాచాలు ఆడిన నాటకం కారణం అని అందరూ గ్రహించారు. అనుకున్న ముహూర్తానికి ఆదిలక్ష్మి పెళ్ళి హాయిగా జరిగిపోయింది.



# ఆఫ్రికా జింకలు

జింకజాతి జంతువులలో ఆకారంలో చాలా పెద్దవి ఆఫ్రికా జింకలు. పందెపు గుర్రాల్లా పరుగులు తీసే వీటిని మచ్చికచేసి ఆఫ్రికాలో పెంపుడు జంతువులుగా కూడా పెంచుకుంటారు.

పెద్ద ఆకారం, మెలికలు తిరిగి నిటారుగా ఉండే వాటి కొమ్ములు, గంగడోలు, ముఖం మీదా, భుజాల మీదా కుచ్చుగా ఒత్తయిన వెంట్రుకలు, ఎద్దు తోకలాంటి తోక కలిగిన ఈ ఆఫ్రికా జింకలు ఆకులూ, అలములూ తిని బతుకుతాయి. వయసుకు తగినట్టు వీటి శరీరం రంగు మారుతూ ఉంటుంది. మామూలుగా నీలిరంగు కలిసిన ఊదా రంగుతో ఉంటుంది.

ఆఫ్రికా ఎడారి ప్రాంతాలలోనూ, కొండ ప్రాంతాలలోనూ కనిపించినప్పటికీ ఈ జింకలు పచ్చిక సమృద్ధిగా లభించే మైదానాల సమీపంలో గల అడవులలోనే ఎక్కువగా ఉంటాయి.

పగలల్లా అడవులలో గడిపే ఈ జింకలు రాత్రిపూటా, వేకువజామునా మైదానాలలోకి వచ్చి, అక్కడి తటాకాలలో నీళ్ళు తాగి వెళతాయి. ఈ జింకలు యాభై నుంచి వందవరకూ గుంపులు గుంపులుగా జీవిస్తాయి. మగజింకలు మాత్రం ఒకటి రెండు ఒంటరిగానూ, చిన్న చిన్న గుంపులుగానూ తిరుగాడుతూ ఉంటాయి.

వీటి శరీరం పెద్దది అవటం వల్ల, ఇతర జంతువులతో పోల్చినపుడు ఈ జింకలు కాస్త మంద కొడిగా కనిపిస్తాయి. అయినా, అవసరమయినప్పుడు గాలిలో చాలా ఎత్తుకు ఎగురుతూ పరిగెత్తగలవు. ఇవి ఆఫ్రికా చిట్టడవులలో మందలు మందలుగా చేరి, పందెపు గుర్రాల్లా చెట్ల పొదలనూ, కాలువలనూ, దాటుతూ పరుగులు తీసే దృశ్యం చూడడానికి ఎంతో ఆహ్లాదకరంగా ఉంటుంది.

సాధారణంగా పిరికిగా కనిపించే ఈ జంతువులు, ఆపద వచ్చినపుడు తమ పిల్లలను కాపాడుకోడానికి వాడియైన కొమ్ములనే ఆయుధాలుగా భావించి పోరాడుతాయి. ఈ జింకలు రెండేళ్ళకొకసారి మాత్రమే ఈతకు వస్తాయి. అందువల్ల వీటి అభివృద్ధి మితంగానే ఉంటున్నది.

ఒకప్పుడు ఆఫ్రికాలోని దక్షిణ, తూర్పు ప్రాంతాలలో విరివిగా కనిపించే ఈ జింకల సంఖ్య నానాటికి తగ్గుతున్నది.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1985 డిసెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.





S. B. Prasad — Madhavi Sanara

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ అక్టోబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### ఆగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: చదువు చదువు అనకు! రెండవ ఫోటో: వస్తుంది నాకు కునుకు!

పంపినవారు: శ్రీమతి సూరిమణిప్రభాకర్, రామ్‌నగర్, హైద్రాబాద్-48

బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.

### మీకు తెలుసా ? సమాధానాలు

1. కృష్ణానది 2. యమున 3. తపతి 4. కోసీనది 5. చంబల్‌నది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications), 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.



దీన్ని నోటిలో చప్పరించండి. నాలుకతో గిరగిర
తిప్పండి. మీ నాలుకని దాని
చుట్టూ తిప్పండి.



ఎందుకంటే, దీనిపైన నున్నని,
కమ్మని కారమెల్ ఉంది,
లోపల అసలు సిసలైన క్యాడ్‌బరీస్
డెయిరీ మిల్క్ చాక్లెట్ దాగి వుంది.
మరి సరదాగా రండి, మజాగా
అందుకోండి, మరింత మజాగా
చప్పరించండి!













క్యాడ్‌బరీస్
# చాక్లెట్ ఎక్లెయిర్ పాప్స్

మజామజా అనుభవం! ఎంతోసేపు నిలిచే కమ్మదనం! పాప్ లాలీ రుచికరం!

67

L HCP EP 1 2116 TL

# రాతలో విజేత నటరాజ్ పెన్సిల్

నటరాజ్‌తో రాయడంలో మజాయే వేరు. ఇదే, నటరాజ్ పెన్సిలును ఎన్నుకునే వారందరి మనసుల్లోని మాట. అవును మరి. నటరాజ్ ఎంతో చక్కగా రాస్తుంది. నున్నగా, నల్లగా, సన్నగా, ముక్క విరగకుండా. అందుకే నటరాజ్, ఆ రకానికి చెందిన మరే ఇతర పెన్సిలుకన్న ఎక్కువ కాలం మన్నుతుంది. ఝామ్మని రాస్తూ పోతుంది.







**నటరాజ్** పెన్సిల్

అలుపు లేకుండా రాస్తుంది, అధిక కాలం వస్తుంది.

ఉత్కృష్ట ఉత్పాదనల నిర్మాతలు

హిందుస్తాన్ పెన్సిల్స్ ప్రైవేట్ లిమిటెడ్, బొంబాయి 400 001.

everest/85/HP/190-tl